ప్రపరిచిత భూగోళశాస్త్రము

~~[illegible] భాగము:~~

# ఇండియా

—o❖o—

ముడియం సీతారామారావు బియే. యెల్. టి.

గారిచే వ్రాయబడినది.

మూడవకూర్పు.



1920

 [వెల - 0-9-0.

# ఇండియా.

బ్రిటీషు సామ్రాజ్యమునందు సూర్యుడెప్పుడును అస్తమించుటలేదని చెప్పుట మీరు విని యుండవచ్చును. దీనికి అర్థమేమి? బ్రిటీషువారికి చేరిన ప్రదేశములు ప్రపంచమునందన్నిచోట్ల నున్నవనియు అందుచేత సూర్యుడు యెల్లప్పుడు ఏదియో ఒకభాగముమీద ప్రకాశించు చుండుననియు అర్థము. నావిక ప్రపంచమునందు బ్రిటీషువారు గొప్పబలవంతులగుటచేత వీరు నావల రాకపోకలకు అనుకూలముగా నుండునట్లు మహాసముద్రములందు అనేక ప్రదేశములు సంపాదించుకొన గలిగియున్నారు.

ఆశియాఖండమందు బ్రిటీషువారికి చేరినభాగములు. (1) ఇండియా, బర్మా, సింహళము, హాంకాంగ్ దీవి, సింగపూరు, స్ట్రెయిట్ సెటల్‌మెంట్లు అండమాన్ దీవులు.

ఆఫ్రికాలోనుండు భాగములు కేప్ కాలని, ట్రాన్సువాల్, నెటాల్ మొదలైన దక్షిణ బ్రిటీష్ ఆఫ్రికా, పడమటి భాగముననుండు గాంబియా, సెరాలియోన్, గోల్డుకోస్టు, సెంట్ హెలీనా, అసన్‌షన్ దీవులు, తూర్పుననుండు బ్రిటీష్ తూర్పు ఆఫ్రికా, సోమలిలాండు, జాంజిబారు మొరిషస్ దీవులు, ఉత్తరముననుండు ఈజిప్టుదేశము.

అమెరికాలోని, కెనడా, న్యూఫౌండులాండు (Newfoundland) బర్మ్యూడా దీవులు, బ్రిటీషు హాండూరాస్, బ్రిటీష్‌గయనా, ఫాక్‌లాండు దీవులు, పడమటి ఇండియా దీవులలోని జమైకా, బార్బడోస్, ట్రినిడాడ్ ద్వీపములు. ఆస్ట్రేలియా, టాస్మేనియా, న్యూజీలాండు, ఫీజీద్వీపములు,

బ్రిటిష్‌వారికి చేరిన దేశములు



## ఇండియా, బర్మా, సింహళము.

మనముండు దేశమున కిప్పుడు ఇండియా యని పేరు. పూర్వము భరతవర్షమని పేరుండినది. కాని అప్పటి భరతవర్షమే ఇప్పటి ఇండియా దేశమనుటకు వీలులేదు.

ఇప్పటి స్థితులనుబట్టిచూడవడమటనుండు ఆఫ్గనిస్థానము మొదలు సయామువరకును, ఉత్తరమున హిమాలయ పర్వతము మొదలు దక్షిణమున కన్యాకుమారి అగ్రమువరకును వ్యాపించియుండెడి దేశమునకు ఇండియా యని పేరు. ఇందు బ్రిటీషు బెలూచిస్థానము, నేపాళము, భూటాను మొదలగు స్వతంత్రదేశములు కూడ చేరియున్నవి. బర్మాకూడ ఇండియా రాజ్యములో చేరినదే.

ఈక్రింది జాబితానుబట్టి చూడ మనదేశము బ్రిటీషు దీవులకంటె 17 రెట్లు పెద్దదని తేలుచున్నది. మన చెన్నరాజధానియొక్క వైశాల్యము ఒకటియని అనుకొంటిమేని ఇతర దేశముల తారతమ్య వైశాల్యము 2 వ కలములోనుండు సంఖ్యలు తెలియజేయుచున్నవి. జన బాహుళ్యమునందు కూడ మన చెన్నరాజ్యమునే ప్రమాణముగా గొంటిమేని ఇతర దేశవివయములు కూడ 5 వ కలములోనుండు సంఖ్యలు తెలుపును.

**గొప్ప దేశము:** మనదేశము సామాన్యదేశములవంటిది కాదు. ఇది వైశాల్యమునందును జనసమ్మర్దమునందును ప్రపంచ దేశములకంటె గొప్పది కాకపోయినను మిగత వానికి తీసిపోవునది కాదు. ఇది ఆసియాఖండములో నొకభాగమేయైనను దీని రొల్లలను బట్టి చూచినను, వైశాల్య శీతోష్ణముల బట్టిచూచినను ఇందుండు భాషాచారవ్యవహార భేదములుగల జనులను బట్టి చూచినను, దీనినొక ఖండముగా భావింప వలసినదే. (1) వైశాల్యమునందు ఆస్ట్రేలియాలో సగమున్నది. జన సంఖ్యయందు ఆఫ్రికాను

జాబితా A.

| దేశము లేక ఖండము | 1<br>వైశాల్యము చదరపుమైళ్లు | 2<br>మద్రాసు కంటె రెట్లన్ని | 3<br>జనసంఖ్య | 4<br>చదరపు మైలున కున్సంఖ్య | [illegible] |
|---|---|---|---|---|---|
| ఆశియా | 1 70,74,050 | 113,0 | | | |
| ఉ. అమెరికా | 92,94,330 | 61,5 | | | |
| ద అమెరికా | 68.17,390 | 45,1 | | | |
| ఆఫ్రికా | 1,15,21 530 | 76,5 | | | |
| ఐరోపా | 33,66,740 | 22 3 | | | |
| ఆస్ట్రేలియా | 29,72,000 | 19,7 | | | |
| బ్రెజీల్ | 31,90,000 | 21,1 | 1,65,00,000 | 5 | 0,4 |
| కెనడా | 36,53,000 | 24,2 | 53,38,000 | 17 | 0,1 |
| చైనారాజ్యము | 42 77,000 | 28,3 | 35,80,00,000 | 83 | 8,0 |
| చైనా | 15,20,000 | 10,0 | 34,50,00,000 | 225 | 7,8 |
| ఐరోపాలోని రష్యా | 20,95,000 | 13,8 | 10,62,64,000 | 51 | 2,4 |
| ఆశియాలోనిరష్యా | 65,23,000 | 41,3 | 2,26,95,000 | 4 | 0,5 |
| యునైటెట్ స్టేట్సు | 30,00,000 | 19,9 | 7,56.02,000 | 26 | 1,7 |
| బ్రిటీషు దీవులు | 1,44,000 | 0,9 | 4,59,56,000 | 318 | 1,02 |
| మదరాసు రాజధాని | 151,000 | 1,0 | 4,23,99,000 | 280 | 1,0 |
| ఇండియా రాజ్యము | 17,90,000 | 11,8 | 30,44,49,000 | 114 | 6,9 |
| బర్మా | 2,31,000 | 1,5 | 1,04,49,000 | 45 | 0,2 |
| ఇండియా | 15,59,000 | 10,3 | 29,40,00,000 | 153 | 6,9 |

మించినది. దీనిచుట్టున మూడు యెల్లలు విస్పష్టముగ నున్నవి. ఉత్తరమున పర్వతరాజమననొప్పు హిమాలయ పర్వతము ఆకాశమునంటి యున్నదేమో యనునట్లు శిఖరములచే నొప్పుచు 150 మైళ్ల వెడల్పు గలిగి, అభేద్య

ముగా నున్నది. వీనిశాఖలు తూర్పు దక్షిణములకు వ్యాపించి దేశమునకు కోటగోడవలె నేర్పడియున్నవి. మిగతభాగములందు సముద్రము దేశమును చుట్టియున్నది. ఇట్టి మనదేశమునందుండు శీతోష్ణాదిభేదములు మరెచ్చటను కానరావు. దక్షిణమున రామేశ్వరమునుండి దక్కను పీఠభూమిమీదుగా హిమాలయ పర్వతము దాటువారి కెట్టివింతలు కనబడును ! మొదట ఉష్ణాధిక్యత గలిగి కొబ్బరి అరటి తోటలుగల ప్రదేశము మీదుగా వెళ్ళి నీటి నష్ట యితక్కునగను, ఎటు చూచినను వృక్షమనునది లేక నల్ల తుమ్మ చెట్లు అచ్చటచ్చట గలిగి నల్లగనుండు పీఠభూమి రేగటినేలమీదుగావెళ్లి, అరణ్యములు గల వింధ్య పర్వతములను దాటి ఫలవంతమగు గంగానదీ మైదానముల మీదుగా హిమాలయపర్వతము అడుగున నుండు మహారణ్యముగుండ వెళ్లి, విపరీతపు చలి గలిగి నిరంతరము హిమముండు హిమాలయ పర్వతము చేరుదుము. ఇట్లే పడమట బయలుదేరితిమేని వర్షమే లేని సింధుదేశమునుండి సంవత్సరము పొడుగునను వర్షము గల అస్సాము బంగాళాదేశములు చేరుదుము

(2) దీనినిబట్టి చూడగా మనదేశమునందు ప్రపంచపు శీతోష్ణస్థితులు దాదాపుగా నన్నియు నున్నట్లు ఏర్పడుచున్నది ఒక భాగమున నిరంతరము వర్షము కురియుచుండుననియు మరియొకచోట వర్షమే లేక ఎడారి ప్రదేశమగుననియు చెప్పుటచేత ఈమధ్య భాగములయందు కొన్నిచోట్ల వర్ష మెక్కువగాను, కొన్నిచోట్ల వర్షము తక్కువగాను కురియునని తోపకమానదు. వర్షాతపము లధికములగు ప్రదేశములున్నవి మరికొన్ని ప్రదేశములందు చలి యధికమయి నిరంతరము హిమముండును కావున ఇట్టి శీతోష్ణ భేదములుగల దేశమందు వానికి తగిన పంటలు ఉత్పత్తియగుట సహజమేకదా ! కావున మనదేశమువలె అన్ని విధములైన పంటలు ఫలించుదేశము మరియొకటి కానరాదు. జనసంఖ్యయందు మనదేశము ప్రపంచమున రెండవది. నాగరికతయం దితరదేశములకు తీసిపోదు కాన ఇండియాదేశము బ్రిటీషు కిరీటమునం దొక యమూల్యమణి యని చెప్పుటయందు (Fairest Jewel in the British Crown) అతిశయోక్తి యొంతమాత్రమును లేదు.

మనదేశము ఇట్టిదని సామాన్య జనులు ఎరుగుదురా? తాముండు భాగమే ఇండియా దేశమని జనులు అనుకొనుచున్నారు. మనదేశమునందు వివిధ శీతోష్ణాది భేదములున్నవనియు, తదనుగుణ్యముగా పంటలు జంతువులు, మారియుండుననియు, వీని ననుసరించియుండు జనులు మతాచార వ్యవహార భేదములు గలిగి పలుభాషలు మాటలాడుచుండినను వీరు అన్యులు గాక మనవారే యనియు సామాన్యజను లెరుగరు. ఎరిగినవారియందు గూడ భ్రాతృభావమింకను వృద్ధినొందలేదు. పూర్వము హర్షవర్ధనుఁడు అశోకుఁడు చంద్రగుప్తుఁడు మొదలగు మహారాజులు పాలించుచుండునపుడు మనదేశము ఉన్నత పదవి యందుండి నాగరికతయందు పశ్చిమదేశములకన్న నెక్కువ స్థితి యందుండినది. మనఢక్కానయపు బట్టలు, మన కాశ్మీరపు శాలువలు మొదలయినవన్నియు పశ్చిమదేశములకు వెళ్ళి అచట జనులకాశ్చర్యము గలిగించుటచేత మనదేశము సారవంతమైనదనియు, సహజసంపద కలదనియు పశ్చిమఖండవాసులు తెలిసికొని యొక కన్ను మనదేశముపై వైచియుండిరి.

ఇట్లుండ మన మహారాజుల కుండవలసిన సుగుణములు నశించుటచేత కాబోలు దేశము చిన్న చిన్న రాజుల వశమయి వారిలో అంతఃకలహములు ప్రబలుటచేత దేశము పరరాజుల దండయాత్రలకులోనయ్యెను. దేశమున గడబిడలు మెండయ్యెను. దొంగలు బందిపోటులు నిరాతంకముగ వారిపనులు జరుపుకొనుచుండిరి. జనులకు నెమ్మదిలేకపోయెను. బ్రతుకు దుర్భరమయ్యెను. ఈసమయమున ఇంగ్లీషువారు మనదేశమునకు వచ్చిరి. వర్తకస్థానముల సంపాదించుకొని దేశమున ప్రబలియుండు అంతఃకలహముల బాగుగా నెఱిఁగియుండుటచే సమయోచితముగ వర్తించుచు క్రమక్రమముగా దేశమంతను స్వాధీనపరుచుకొని మన భరతఖండమునకు నాయకులైరి.

బ్రిటీషు ప్రభుత్వము వచ్చిన తరువాత అంతఃకలహములు పోయినవి. ప్రజలందరు తమకు ఒకటే అగుటచేత నిష్పక్షపాతబుద్ధితో దేశమునంతయు ఒకటే చట్టమును వ్యాపింపచేసిరి. ఇనుపదారులు మొదలగు ప్రయాణసౌకర్యము లెక్కువగుటచేతను, పశ్చిమవిద్య మనదేశీయులు నేర్చుకొనుటచేతను

జను లోకభాగమునుండి మరియొక భాగమునకు సులభముగ వెళ్ళుచుండుట చేతను, ఇతర భాగపుజనులతోడి సహవాసము కల్గి పూర్వపు ద్వేషభావము పోయి, భేదము లెన్నియున్నను అందరము భారతీయుల మనియు, అందరము బ్రిటీషు సామ్రాజ్యములోని ప్రజలమనియు, ఐకమత్యభావ మిపుడిపుడు అంకురించుచున్నది. జనులకు స్థిరజీవన మేర్పడుటచేత వ్యవసాయ పరిశ్రమ వ్యాపారవిషయములు వృద్ధి నొందుచున్నవి. అప్పుడప్పుడు భాషవర్ణమతాభి ప్రాయభేదములు పట్టి అవి విరోధకారణములుగ నేర్పడుచుండినను సహకార భావ సత్ప్రవర్తనలే ఇహపరములకు ముఖ్యావశ్యకములని మన భారతీయు లందరు తెలిసికొందురు గాక. ఈయైకమత్యపు టంకురములు వృద్ధియై దేశ మునకును దేశాధీశులకును, సర్వులకును సుఖమిచ్చుగాక !

ఉనికి

ఇట్టి మనదేశముయొక్క యునికిగూర్చి కొంత యోచింతము. లాంగు మెన్సు అట్లాసులోని మూడవ పటమును చూడుడు. మనదేశముయొక్క యునికిని గమనింపుడు. ఇది ఆఫ్రికా, ఆస్ట్రేలియా ఆశియా ఖండములకు నడుమ నున్నదికదా. ఇందుచేత పూర్వమునుండి ఈదేశముతో వ్యాపారము జరుగుచుండెనని నమ్ముటకు వీలున్నది. పూర్వము వివిధములైన నావలు మన దేశమున తయారగుచుండినవి. వానిసాయమున మన దేశపువారు జావా మొంద లగు ద్వీపములకును, పడమటనుండు అరేబియా బాబిలోనా, ఈజిప్ట్ దేశము లకు వెళ్ళుచు వ్యాపారకార్యములు జరుపుచుండిరట. పూర్వవిషయ మెట్లుం డినను ఇప్పుడు స్టీమరులు సులభముగను క్షేమముగను యాత్రచేయునుగదా. పటమునందలి ఊదాగీతలు స్టీమరుల దారులను చూపుచున్నవి. ఇంగ్లండు, ఆస్ట్రేలియా, ఆఫ్రికా, మొదలగు వానితో వ్యాపారము జరుగుచున్నది. నూత నముగ పేరొందిన జపాను దేశము, క్రొత్త త్రోవ త్రొక్కుచుండు చైనా దేశముగూడ సమీపములేకదా. కాబట్టి మనదేశమునందు పంటలు పుష్క లముగ పండెనేని వానినుండి సరకులను సులభముగను చౌకగను మ్యానుఫా క్చరు (చేతిపనులు) చేయగలిగితిమేని మనదేశపు వ్యాపారము వృద్ధియగుటకు

ఎంతైనను అవసరమున్నదని చెప్పక తప్పదుకదా? నౌకాబలముగల బ్రిటీషు వారి సహాయముననే ఇది జరుగగలదు.

## చుట్టుపట్లు

ఎల్లలు : దీనికి ఉత్తరమున దాటకూడని హిమాలయ పర్వతములున్నవి. దీనిశాఖలు తూర్పు పడమటి వైపునకు వ్యాపించి హిందూస్థానమునుండియు ఆఫ్గనిస్థానమునుండియు మనదేశమును వేరుచేయుచున్నవి. మిగత భాగములందు సముద్రమున్నది, (తూర్పున బంగాళాఖాతము, పడమట అరేబియా సముద్రము )

తటరేఖ : మనదేశపుతటరేఖ 5,000 మైళ్ళు పొడవుండినను దీనియందు చీలికలు నాలుగైదు మాత్రమే యున్నవి. ఈలోపము పూర్వకాలము పెద్దనావలకు ఒక అడ్డుగా నుండినను ప్రకృతిశాస్త్రములు ప్రబలియుండు ఈకాలమునందు కృత్రిమపు (Artificial) హార్బరులను నిర్మించుట చేతను, ఇనుపదారులు కాలువలు మొదలగువానిని ఎక్కువచేయుట చేతను ప్రయాణసౌకర్యములను అధికముచేసి వర్తక వ్యాపారములకుసాయముచేయ వచ్చును,

పడమట సింధునది సముద్రము చేరుచోట తటరేఖయందు చీలికలున్నవి కాని ఇచట హార్బరు బయలు దేరుటకు అనుకూలములేని కారణమున కొంచెము దూరమున నొక కృత్రిమపుహార్బరును నిర్మించియున్నారు. కరాచీ హార్బరు ఇంగ్లాండునకు మిక్కిలి సమీపమున నుండుటచేతను, దీనివెనుక భూమియగు సింధుపంజాబు దేశమందు ప్రత్తి, గోధుమ, పంటలు అధికముగుటచేతను ఇది ప్రాముఖ్యమునకు వచ్చినది. ఇచటినుండి బయలుదేరు స్టీమర్లు ప్రత్తిని గోధుమలను తీసికొనిపోవును.

తరువాతి చీలిక కచ్ సింధుశాఖ (Ran of Cutch). దీనిని హార్బరుగ ఉపయోగించుటకు వీలులేదు. ఎందుకనగా వేసవికాలమున నిది దాదాపుగా నెండిపోవును. వర్షకాలమునందు లోతు తక్కువగ నుండును. అడవి గాడిదలుమాత్ర మిచట నుండును.

కాంబేసింధుశాఖ (Gulf of Cambay) మూడవది. దీనిహార్బరు అంత మంచిది కాకపోయినను తపతీనదీ ముఖద్వారమున నుండు సూరత్ పట్టణముద్వారా వ్యాపారము జరుగుచుండినది. అనంతరము బొంబాయి బ్రిటీషువారి పాలనక్రిందికి వచ్చి, పడమటి కొండలమీదుగా రైల్ దారిపడిన తరువాత, సూరత్ వ్యాపారమంతయు బొంబాయికి తిరిగెను.

బొంబాయి : మిగిలిన హార్బరులన్నిటికంటెను లోతైనది. క్షేమకరమైనది. ఎందుకనగా ఇది ద్వీపముమీద నున్నది. దీనిచాటున హార్బరుండుట చేత, అరేబియా సముద్ర మెంత భీకరముగా నున్నను హార్బరులోని జలము తొణక కుండును. ఇంగ్లాండునకు సమీపముననుండు క్షేమకరమైన రేవగుట చేతను, దీనివెనుక భూమి దూదికి ప్రసిద్ధి కెక్కినదగుటచేతను, ఇది ఇండియా దేశమునకు ఒకవిధముగా నడుమనుండు హార్బరగుటచేతను, దీనిప్రాముఖ్యము యెక్కువయినది. ఇందలి యంత్రశాలలు చూచినయెడల పశ్చిమ దేశీయుల పట్టణమేమోయని భ్రమపడక తీరదు.

తరువాత గోవా, కళ్ళికోట రేవులున్నవి. కాని ఇవి అంత ప్రసిద్ధి చెందలేదు పడమటి తీరమున దక్షిణభాగమున చీలిక లనేకము లున్నవి. ఇవి ఉప్పునీటి కయ్యలు (Back waters of Cochin and Malabar) వీనిమీదుగా తీరపు వ్యాపారము చిన్నపడవలలో జరుగును గాని సముద్రపు నావలకు ఇవి పనికిరావు. ఇండియాకు దక్షిణముననుండు నది మన్నారు సింధుశాఖ. ఇచట రామేశ్వరపు శేతువయు, పాక్సుద్వీపమును ఉండుటచేత పాక్సుజలసంధి లోతుగా నుండుటలేదు. సామాన్యపు స్టీమరులు పోటు తగిలినపుడు దాటిపోవును. కాని పెద్దస్టీమరులు సింహళమును చుట్టియేపోవలయును. అయినను పెద్దస్టీమరుల నుపయోగించుటకు తగినట్టుగా కాలువ నొకదానిని త్రవ్వ యత్నించుచున్నారు. తరువాత తూత్తుకుడి (Tutucorin) రేవుపట్టణమున్నది. ఇక్కడినుండి అనేకకూలివారు సింహళపు తేయాకు తోటలలో పనికై గుంపులు గుంపులుగ వెళ్ళుచుందురు.

తరువాత ప్రళయ కావేరి, చిల్కా సరస్సులు, ఇవి ఉప్పునీటి చెఱువులు. ఈనడుమనుండు విశాఖపట్టణము వద్ద తీరము రాతిమయమగుటచేత స్టీమరులు తీరమును సమీపించును. ఇకముందు దీనిని మంచి హార్బరుగా చేయవలయునని ప్రయత్నములు జరుగుచున్నవి.

గంగానది ముఖద్వారమున డైమండ్ హార్బరు ఉన్నది. ఇదిమంచిది కాదు. ఒండు మట్టివలన పూడిపోవుటచేతను, వెనుక ప్రదేశము ఎక్కువ తేమవల్ల రోగిష్టిదగుటచేతను, కలకత్తావరకు నావలకు లోతైన కాలువను తీసి దానిని మంచిస్థితియం దుంచియున్నారు.

బర్మాయందు మార్టబాన్ సింధుశాఖ కలదు. ఇందు ఐరావతి సాల్విన్ నదులు కలియును. ఇచట రంగూను హార్బరు ముఖ్యమయినది.

అగ్రములు: దక్షిణమున కన్యాకుమారి (Cape Comorin.), బర్మాకు దక్షిణమునందు నీగ్రిస్ అగ్రములు ముఖ్యములయినవి.

మనదేశపు తటరేఖయందు చీలికలు లేకపోవుటయే కాక సమీపమునందు ద్వీపములు కూడలేవు. ఈకారణముచేత సముద్రపుతీరమున నుండు జనులైనను సముద్రయానమున కలవాటుపడినవారు కారు. యూరోపుఖండమునకు దక్షిణమునందు గ్రీసుదేశముచుట్టును సమీపమున ద్వీపము లనేకముండుటచేత గ్రీకుదేశీయులు అనాదినుండి అసహాయశూరు లగునావికులని పేరుపొందిరి.

పడమటితీరమున నుండు బొంబాయి, సాలసెట్టు ద్వీపములు బొంబాయి హార్బరును మంచి క్షేమకరమైన హార్బరుగా చేసినవి. లక్ష ద్వీపములు, మలయద్వీపములు, పవడపుద్వీపములు. ఇవి తీరమునకు చాలాదూరమున నున్నవి. ఇందు కొన్నిభాగములందు కొబ్బరికాయలు అపరిమితముగ పండును. ఇండియాకు దక్షిణమున రామేశ్వరము ఉన్నది. ఇది గొప్ప యాత్రాస్థలము. దీనికి దక్షిణమున సింహళద్వీపము ఉన్నది.

దీనినే లంకయందురు. ఇచట రావణాసురు డుండెననియు వానిని రాముడు సంహరించె ననియు రామాయణము చెప్పుచున్నది. ద్వీపము లన్నిటిలో మంచిదశయం దుండునది ఈద్వీపమే. దీని సమీపమున ముత్యపుచిప్పలు తీయుదురు.

తూర్పు తీర సమీపమున ద్వీపములు లేవు. డైమన్డు దీవి గంగా నదీ ముఖద్వారముననున్నది. నీగ్రేస్ అగ్రమునకు దక్షిణమున అండమాన్ దీవులున్నవి. ఇందులోని పోర్టుబ్లేరు నకే మనదేశమునుండి ద్వీపాంతర పుఖైదీలను పంపుచున్నారు. ఇచటి స్వదేశీయులు నల్లని బిరుసువెండ్రుకలు కలవారై పొట్టిగ నుందురు.

హార్బరులుగాని ద్వీపములుగాని సమీపమునలేని మనదేశపు తీరము వెంబడి సముద్రప్రవాహములు ప్రవహించుటచేత వీనివెంబడి కొట్టుకొనివచ్చు ఇసుకవెల్లి హార్బరులను పాడుచేయుచున్నది. కాననే మదరాసు హార్బరు చెడిపోవుచున్నదనియు దీని ముఖము ఉత్తరమునకు త్రిప్పవలయు ననియు ఉన్నారు. గంగానదీ ముఖము మీదుగా ప్రవాహములు ప్రవహించుటచేత నదిలోని జలమునకు కొంతనిలుకడ కలుగును. కావున దాని యందుండు ఒండుమన్ను క్రిందజారదు. అందుచేత నావలదారి పూడిపోవుచునే యుండును.

పైని చెప్పిన వానిని బట్టిచూడ మనదేశపు తీరతటమునందు చీలికలు లేకపోవుటయు, ద్వీపములు సమీపమున నుండకపోవుటయు, మీదు మిక్కిలి ఉండినకొన్ని హార్బరులందుకూడ ఇసుక చేరియుండుటయు, మనతీర రేఖకు లోపములుగా నున్నవి. ఇందుచేత గ్రీకుదేశమువారిని నావ యాత్రకు పురికొల్పినటుల మనదేశపువారిని పురికొల్పు కారణము లెవ్వియు కానబడకపోయినను పూర్వము తేలికనావలను గట్టి మనవారు విదేశములకు బోవుచుండినట్లు ప్రబలనిదర్శనము లున్నవి.

## నిమ్నోన్నతములు

మన మాకాశమునుండి మన దేశమును చూచితిమేని మనదేశము నందు స్వాభావికభాగము లగుపడును. (1) ఉత్తరమున నుండు విశాల మగు పర్వతప్రదేశము. (2) దక్షిణభాగమున సముద్రమున చొరబడియుండు ఉన్నత పీఠభూమి. (3) ఈరెంటికిని నడుమ నుండు సింధు గంగ మైదానములు. (4) తీరపు మైదానములు. (5) పర్వతమయమైన బర్మాదేశము, అందలి ఐరావతీ మైదానము,

1. ఉత్తరపు పర్వత ప్రదేశము: (a) ఆశియాఖండపు పర్వత సముదాయమునకు కేంద్రము అనదగు పామీరు పీఠభూమి నుండి పర్వతములు అన్నివైపులను వ్యాపించియున్నవి. నైఋతిమూలగా వ్యాపించియుండు పర్వతపంక్తులకు మొదట హిందూకుష్ పంక్తి అనియు తరువాత సులేమాన్, కీర్థార్ పంక్తులనియు పేర్లు. వీనియెత్తు సరాసరి 6,000 అడుగులుండును కాని ఇందుండు టాక్తిసులేమాన్ శిఖరము 15,000 అడుగుల (ఎన్నిమైళ్ళు) యెత్తుండును. ఈపంక్తులందు నాలుగు కనుమ లున్నవి. ఈకనుమలగుండ రాకపోకలు జరుగుచున్నవి. ఖైబరు కనుమ గుండ వచ్చువారు పెషావరు పట్టణము చేరుదురు. పారసీకదేశమునుండి వచ్చువారు బోలన్ కనుమ గుండ క్వెట్టా మీదుగ సింధు దేశములోనికి వెళ్లుదురు, ఇవి గాక కుర్రాం, గోమల్ కనుమలు కూడనున్నవి. పూర్వము ఈ కనుమలగుండ శత్రురాజులు మనదేశమునకు వచ్చిరి. వారెవరో చెప్పుము.

ఈపర్వతపంక్తులయొక్క ఉత్తరభాగమునందు వర్షము కురియుటచేత వెచ్చనిమండలపు పంటలు పండగలవు. కావున జనులు వ్యవసాయము చేసి నిలుకడగ గ్రామములందు జీవింతురు, దక్షిణభాగమున వర్షము తక్కువగుటచేత పంటలు పండవు. జనసమ్మర్దము తక్కువగుటయేగాక

వీరికి స్థిరజీవనముండదు. వేసవి కాలమున పీఠభూములమీద వీరు నివసింతురు. కాని చలి కాల మారంభమయినతోడనే ఇచటి గాలియందు తేమ లేకపోవుట చేత చలి యెక్కువగ నుండును. ఈ చలికి తాళలేక జనులు సింధుదేశమునకు వలసపోదురు.

(b) ఈపర్వతములకు కేంద్రమని చెప్పబడిన పామీరు పీఠభూమి నుండి తూర్పునకు 1500 మైళ్ళు అభేద్యమైన హిమాలయపర్వతము లున్నవి. ఈ పర్వతము సమాంతరముగా (Paralell) నుండు పర్వపంక్తులుగా నున్నవి కాని కేవల మొక్క పర్వతపంక్తి కాదు, వీనినిగూర్చి వెనుక చెప్పెదము.

ఈ పర్వములు తూర్పునకు వెళ్లి, ఈశాన్యమునుండి దక్షిణమునకు వంగి మెలికలు మెలికలుగా మలయా ద్వీపములవరకు (Malaya Peninsula) వ్యాపించి యున్నవి. వీనికి నాగా పర్వతములనియు, కాసీ పర్వతము లనియు, యోమా పర్వతము లనియు పేర్లు. ఈపర్వతము లుత్తరము నుండి దక్షిణమునకు వ్యాపించియుండుటచేత వీనినడుమ నదులు ప్రవహించు చున్నవి. ఇచట రాకపోకలు అసాధ్యము. మైదానము లంతగా లేవు. ఇందు జనసంఖ్య తక్కువ,

11, ఈపర్వతములకు దక్షిణమున సింధు గంగానదీ మైదానము లున్నవి. బ్రహ్మపుత్రానది కూడ ఇందు కొంతదూరము ప్రవహించుట పటములవలన తెలియును, దీనిని గురించి వెనుక చెప్పెదము.

111. ఈభాగమునకు దక్షిణమున నుండునది దక్కను పీఠభూమి. ఇది త్రిభుజాకారముగ నున్నది. దీనికి మూడువైపులను కొండ లున్నవి. ఉత్తరమున వింధ్య, సాత్పూరా పర్వతము లున్నవి, ఇవి తూర్పునకు వ్యాపించి కైమూరు కొండలను చేరున గంగానదీ మైదానమును సమీపించు చున్నవి.

తూర్పు భాగమున తూర్పుకనుమలును పడమటి వైపున పడమ

టికనుమలును ఉన్నవి. వీని నడుమనుండు భాగమే దక్కను పీఠభూమి. పటమును చూచినయెడల ఈభాగమునందు ప్రవహించు నదులను బట్టి ఇది చదునుగా నుండక మిట్టపల్లములుగా నున్నట్టు ఏర్పడుచున్నది. ఈ తూర్పు పడమటి కనుమలు ఒకటి నొకటి సమీపించుచు నీలగిరి వద్ద కలియుచున్నవి. ఈ రెండు కొండలొకచోట ఏకమగుటచేత వానియొక్క ఎత్తు ఎక్కువయినది. కావున ఇచట దొడ్డబెట్ట (పెద్దకొండ) అను 9,756 అడుగుల శిఖరము కలదు, ఈకొండ లిక్కడినుండి కార్డమం (Cardamum) కొండలను పేరుతో వ్యాపించి దక్షిణమున కన్యాకుమారి అగ్రమువద్ద అంత్యమగుచున్నవి.

IV. ఈదక్కను పీఠభూమికి రెండు ప్రక్కలను రెండు తీరపు మైదానము లున్నవి. ఇందు ఏమైదానము యెక్కువ వెడల్పు గలది? తూర్పు మైదానమునందు గోదావరి, కృష్ణ, కావేరినదుల డెల్టా లున్నవి, పడమటి తీరపు మైదానమంత వెడల్పుగ నుండకుండుటచేత డెల్టా లేవియు లేవు. ఎందుకు? ఇచటి నదులు దాదాపుగా నన్నియు చిన్నకొండ వాగులే. తూర్పు తీరమునకు కోరమండల్ తీరమనియు, పడమటి తీరమునకు మలబార్, కొంకణ తీరములనియు పేర్లు.

V. బర్మాదేశము, ఇది పర్వతప్రదేశము, దీనిని గురించి వెనుక వ్రాసెదము.

## ప్రశ్నలు.

1 మనదేశము గొప్పదేశమని యెట్లు సమర్థింపగలవు? 2 బిటీషు పరిపాలనమువల్ల ఏమార్పులు కలిగినవి? 3 జనసమ్మర్దమునందు మనదేశము యెన్నవది? 4 దీనిని యెన్ని స్వాభావిక భాగములుగా భాగింపవచ్చును?

## శీ తో ష్ణ స్థి తి.

ఏదేశముయొక్కగాని ఖండముయొక్కగాని విషయములు బాగుగా

తెలిసికొనవలయును. నేని దాని శీతోష్ణాది స్థితులను ఎంతశ్రద్ధగ గమనించితిమో అంత స్పష్టముగ ఆవిషయములు విశదమగును.

మన హిందూదేశముయొక్క క్లయిమేటు ఇట్టిదనుటకు వీలులేదు. ఖండమనదగు ఈదేశమునందు లేనిస్థితి మరియొకచోట కానరాదు, నిరంతరము హిమముచే కప్పబడియుండు హిమాలయము మొదలు అత్యుష్ణముగనుండు సింహాళము వరకును, మిక్కిలి తడిగనుండు అస్సాము మొదలు వర్షములేక యెడారిగనుండు సింధుదేశము వరకును ఉండుస్థితులు వివిధములని వేరుగ చెప్పపనిలేదు. ఈస్థితులు కొన్నిచోట్ల ఋతువులనుబట్టి మారుచుండుటచేత మనదేశపు శీతోష్ణస్థితిని ఋతువులనుబట్టి ఆలోచింతము.

మనదేశమునందు వైశాఖమాసము అనగా మేనెలయందు ఎండ విశేషముగ నుండుటయును తరువాత వర్షముకురిసి మొదలుపెట్టి వేడిమి కొంచెము తగ్గుటయును, తరువాత పుష్యమాసమునందు అనగా జనవరినెలయందు చలిగా నుండుటయును, పిమ్మట వైశాఖమాసమువరకు వేడిమి యెక్కువగుచుండుటయును మన మెరిగినవిషయములు. వర్షము కురిసినతోడనే దేశము చల్లబడును గదా. ఏదేశమున వర్ష మెక్కువగ కురియునో అచట వేడిమి అంత అధికముగ నుండదుకదా. వేసవికాలపు ఎండకు తాళజాలక జరుగుబడి గలవారు కొందరు ఉదకమండలము నకును కొడికెనాలు నకును, బెంగుళూరు నకును వెళ్లుచుందురు గదా! మనకు ఎండగానున్నప్పు డచట యెందుకు చల్లగ నుండును? ఒకప్రదేశము సముద్రమట్టము మీద ఎంత యెత్తుండునో దానిని బట్టి అది అంత చల్లగ నుండును. ప్రతి 300 అడుగులకును ఉష్ణోగ్రత ఒకడిగ్రీ తగ్గుచుండును. కాబట్టి ఉష్ణోగ్రతను తగ్గించుటకు ఉన్నతాంశ (Altitude) యొక కారణము.

ఇంతదూరము పోజాలనివారు మదరాసునకుగాని విశాఖ, భీమునిపట్టణములకు గాని లేదా సమీపమునసుండు బెండమూరులంకకు గాని (గోదావరి జిల్లాలోనివారు) యేలాగైననేమి సముద్రతీరమునకు పోవుచుందురు కదా.

ఇచట సముద్రమునుండి పగటిపూటవీచు సముద్రపవనములు ఉష్ణోగ్రతను తక్కువ చేయుచున్నవి. ఎండపూట సముద్రమునుండి భూమిని పవనములు వీచుట సముద్రతీరమునందుండు వారందరెరిగిన విషయమే. కాబట్టి ఈ సముద్రము ఎండకాలము నందయినను ఉష్ణోగ్రతను ఎక్కువ కానియ్యకుండును.

ఇంటనుండువారికి చలిగాలి గాని వడగాడుపు గాని తగులదు కదా. శీత పవనములు వీచుచోట శీతముగాను, వీవనిచోట వెచ్చగానుఉండుట న్యాయమేకదా. శీతోష్ణస్థితి పవనములనుబట్టి యుండుననుట విశదమగుచున్నది. మరియొక విషయము, గుత్తి (అనంతపురముజిల్లా) బెజవాడమొదలగు కొంత గ్రామములందు ఉష్ణోగ్రత యెక్కువగ నుండును. ఎందుకనగా కొండలనడుమనుండుటచేత సూర్యుని వేడిమికితోడు కొండలయొక్క వేడిమికూడ తగులుచుండును. భూమధ్యరేఖకు దూరమునందు ప్రదేశములు పోనుపోను చల్లగనుండుటచే అక్షాంశ కూడ శీతోష్ణస్థితికి కారణమగుచున్నది.

ఈ క్రింది ప్రతిమలు సమ ఉష్ణ రేఖలను (Isotherms) చూపుచున్నవి. (2) వేసవికాలపు రేఖలు (3) చలికాలపు రేఖలు.

పైయంశములను జ్ఞాపకముంచుకొని మన ఇండియాదేశపు స్థితులను ఆలోచింతము.

A. **వేసవికాలపు ఋతుపవనము.** మన ఇండియా దేశము మధ్యరేఖకు ఉత్తరమున 5-వ డిగ్రీనుండి 38-వ డిగ్రీవరకు వ్యాపించి యున్నదికదా. వేసవికాలమునందు సూర్యుడు కర్కాటరేఖ మీదికి వచ్చును. అనగా మనదేశమునకు నడినెత్తినుండును, కావున ఇతని కిరణములు నిలువుగా తగులుటచేత వేడిమి అధికమగును. దక్షిణమునకుకూడ వేడిమి అధికముగా తగులును కాని ఇది ఉన్నత పీఠభూమియగుటచేతను, సముద్రమునకు నడుమ చొరబడియుండు ఇరుకగుభూమి యగుటచేతను, ఉష్ణోగ్రత అంత యెక్కువగనుండదు. ఉత్తరహిందూస్థానము పల్లపు ప్రదేశమగుటచేతను ఉత్తరమునుండి టిబేటు దేశము మీదుగా వీచు శీతపవనములు హిమాలయ

2-వ పటము




వేసవి కాలపు సమఉష్ణ రేఖలు.

పర్వతపు అడ్డు చే తగులకుండుటవలనను వేడిమి అధికమగును. కాన వాయువు కూడ వేడియై పయికి లేచును. అనగా ఉత్తరహిందూస్థానము స్వల్పపీడన

3-వ పటము




చలికాలపు సమఉష్ణ రేఖలు

(Low pressure) ప్రదేశమగును. ఇండియాకు దక్షిణముననుండు హిందూ మహాసముద్రమునకు ఎండ తగులుచుండినను నీటికి అంతవేడిమి యెక్కదు. కాబట్టి ఇది అతిపీడన (High pressure) ప్రదేశమగును. అందుచేత ప

వనములు హిందూమహాసముద్రమునుండి మనదేశముమీదికి వీవ మొదలుపెట్టు

4-వ పటము




సమపీడన రేఖలు (వేసవికాలము.)

ను. ఇవి సముద్రముమీదనుండి వచ్చు పవనములగుటచేత వేడిమికి ఆవిరియైన నీరంతయు ఆవిరిరూపమున పవనములందుండును. ఈపవనములు నిలుకడగా వీవమొదలుపెట్టినపుడు మనదేశమునకు మా౯సూ౯ పవనము (ఋతుపవనము) వీచుచున్నదని అందుము. ఇది సాధారణముగా జూ౯ నెల ప్రారంభమున, అనగా మృగశిరా ప్రవేశకాలమున ప్రారంభమగుటచేత మృగశిరాప్రవేశమయిన తోడనే దేశము చల్లపడునని జనులందురు. ఏకారణముచేతనయినను వర్షము కురియనియెడల వేడిమి తగ్గదు.

5-వ పటము




సమపీడనరేఖలు (చలికాలము)

ఈఋతుపవనము మృగశిరా ప్రవేశమువరకు యెందుకు వీవకుండవల యును? మార్చి నెలనుండి సూర్యుడుత్తరముగా కర్కాట రేఖమీదికి వచ్చుచుండును. అందుచేత వేడిమి యెక్కువగుచుండును గాని, నిలుకడగా స్వల్పపీడనప్రదేశ మేర్పడుటకు ఏప్రెల్, మే నెలల యెండలు తగిలిననే కాని వీలుండదు. కాన ఈ రెండు నెలల యెండచేత మాడియుండు నేలమీద వర్షము కురియునపుడు ప్రజలకేమి జంతువులకేమి యెంత హాయిగా

నుండునో మనకే తెలియును. ఈ పవనములు నిలుకడగా వీచు విషయము, సముద్రస్థితినిబట్టి అరేబియా సముద్రముమీదవచ్చు స్టీమరులు తెలుపుచుండును. ఈఋతుపవనము ప్రారంభముకాగానే అరేబియాసముద్రము అల్లకల్లోలముగనుండి స్టీమరులకు యిబ్బంది గలుగచేయుచుండును.

ఈఋతుపవనము దక్షిణమున పెక్కువేళ్ళమైళ్ళదూరమునుండి వీచుటచేత దీనియందు ఆవిరి నిండియుండునని చెప్పితిమి. ఇది దేశముమీద వీచినపుడు యెత్తైన కొండ లడ్డమువచ్చెనేని వానిని దాటుటకిది ప్రయత్నించును కదా. ఎందుకు దాటవలయునని సందేహము కలుగవచ్చును. ఎందుకనగా వెనుకనుండివచ్చు పవనముయొక్క ధాటిచేత ముందుండునది నిలువజాలక కొండలుదాటును. ఇట్లు దాటునపుడది ఉన్నత ప్రదేశము చేరునుగదా. ఈయున్నత ప్రదేశము మైదానములకంటె చల్లగనుండును. కాబట్టి ఆవిరిచేనిండియుండు పవనము చల్లబడుటచేత ఇందుండుఆవిరి ఘనీభవించి వర్షరూపమున నేలబడును ఈవర్షము పర్వతములమీద కురియునుకదా. ఈకురియుటయందు కూడ పవనము యేవైపునుండి వీచునో ఆవైపుననే యెక్కువ కురియును. పవనము కొండలను దాటిపోవునప్పటికి ఇందలి ఆవిరి తగ్గిపోవుటచేత పొడిపవనమగును. ఈవిషయమును జ్ఞాపకముంచుకొని మనదేశమునకు మాన్‌సూన్ పవనమువలని లాభముల నాలోచింతము. ఈవేసవికాలపు ఋతుపవనము నైఋతి మూలనుండి వీచుటచేత నైరృతిఋతుపవనమని పిలువబడుచున్నది.

ఈఋతుపవనము నైరృతిమూలనుండి మనదేశముమీదికి వీచునుగదా- కొంతభాగము అరేబియా సముద్రముమీదినుండి వీచును. కొంతభాగము బంగాళాఖాతమునుండి వీచును అందుచేత దీనిని రెండుశాఖలుగా ఆలోచింతము. (1) అరేబియాసముద్రపుశాఖ (2) బంగాళాఖాతపుశాఖ.

(1) అరేబియాసముద్రపుశాఖ కన్యాకుమారి అగ్రముమొదలు కరాచీవరకు గల పడమటితీరము మీదుగావీచును. (A) కన్యాకుమారి మొదలు సాత్‌పూరా పర్వతములవరకు వీచు పవనవిషయ మాలోచింతము. ఈతడి పవనము నిలుకడగా వీచుచుండుటచేత అది పడమటి కనుమలదాటునపుడుఆ

కనుమలమీద అపారముగ వర్షము కురియును. అందునను తూర్పువాళ్ళకంటె పడమటివాళ్ళయం దెక్కువ వర్షము పడునుగదా. ఈకనుమలను దాటినతరు వాత పవనమునందంత ఆవిరియుండదు. ఈపవనమే దక్కనుపీఠభూమి మీద నుండు జిల్లాలయొక్క వర్షమునకు కారణము. పొడిపవనముగుటచేత ఈజిల్లాల యందంతగా వర్షము కురియదు. గాలిమాత్రము మిక్కిలి బలముగా వీచును అందులోను బళ్ళారిజిల్లా, కర్నూలు కడపజిల్లాలవలె కొండప్రదేశము కావం దున ఇందు వర్షము తక్కువగ కురియును. కాబట్టి ఈపవనముచేత మలబారు తీరమందు వర్షము యెక్కువ కురిసినను (సంవత్సరమునకు సరాసరి 100-అం గుళములు) తూర్పునందు బెంగుళూరునందు 30 అంగుళములును కర్నూల్ నందు 40 అంగుళములును, కడప యందు 25 అంగుళములును, బళ్ళారి యందు 30 అంగుళములును కురియును. ఈపవనము దక్కనుదాటి బంగాళాఖాతపు పవనములతో కలిసి అప్పుడప్పుడు తుపానులకు కారణముగు చున్నది. ఇట్టి తుపానులవల్ల కురిసిన వర్షముచేతనే మూసీ నది పొంగి హైదరాబాదుకు 1910 సం॥మున అపాయము కలిగించినది.

(B) సాత్పూరా వింధ్య పర్వతములకు నడుమ నర్మదాలోయ యున్నది కదా. ఈ లోయనుండ వెళ్ళిన ఋతుపవనము తిన్నగా గంగానదీ ప్రాంత్యమున నుండు కైమూరు కొండల వరకు నిరాటంకముగా వీచును కాన వర్షమంతయు సముద్రతీరముననే కురియక, మధ్య ఇండియాలో నంత టను కురియును. కాబట్టి యీభాగమునకు వర్షము లేకపోవుట సాధారణముగ లేదు. కొండలనడుమ గొట్టమువలె నుండు లోయయే దీనికి కారణమని వేరు గాచెప్ప పనిలేదు.

(C) ఇక్కడనుండి కరాచీవరకు నుండు తీరముమీద వీచు ఋతు పవనమునకు అడ్డముగా కొండలేవియు లేవు. కావున ఈతడిపవనములం తయు బరువును మోసికొని ఒక నీటిబొట్టయినను ఇయ్యక హిమాలయ పర్వ తము వరకు వీచును. కాబట్టి వర్షము హిమాలయప్రాంతమున కురియును

గాని సింధు మైదానములందు కురియదు. ఇందుచేత సింధుదేశము మొదలు హాలారావళి పర్వతముల వరకు నుండు ప్రదేశమంతయు యిసుక యెడారిగ నున్నది, దీనికి థార్ యెడారి యని పేరు. ఈహాలారావళి పర్వతము లైనను ఋతుపవనమునకు అడ్డముగా లేక ఋతుపవనములు వీచు దిక్కునకే పొడుగుగా వ్యాపించి యుండుటచేత వీనిమీద కురియు వర్షము అధికముగా నుండదు. బెలూచిస్థాన్ వద్దనుండు (కిర్థార్) పర్వతముల దిశకు ఈపవనము వీవకుండుటచేత వానిమీద వర్షము కురియదు.

(2) బంగాళా ఖాతపు శాఖను గురించి ఆలోచింతము. అరకాన్ (Arakan) టెనాసరీము తీరము మీదికి పవనము వీచి పడమటి కొండల మీద యే ప్రకారము వర్షించినదో ఆవిధముగానే ఇచటకూడ సుమారు 100 అంగుళముల వర్షము కురియును. కొంతభాగము బర్మాలో ఐరావతీనది మీదుగా వెళ్ళి బర్మాకు వర్షము నిచ్చుచున్నది.

మిగత భాగము బంగాళాఖాతము పైగా వెళ్ళి చిట్టగాంగు, పూరీలకు నడుమనుండు దేశములోనికి చొరబడినపుడు ఇచట తూర్పుహిమాలయ పర్వతములు అస్సాము పర్వతములు అడ్డము వచ్చును. కొంత భాగము అస్సాము చిట్టగాంగ్ కొండల నడుమ నుండు బ్రహ్మపుత్రా నదిమీదుగా వెళ్ళును. కాబట్టి అస్సాము పర్వతముల దక్షిణభాగమున అపరిమితమయిన వాన కురియును మిగతభాగము హిమాలయ పర్వతములను దాటుటకు ఎత్నించినను అవి చాల యెత్తుగుటచేత వానిని దాటజాలక, పడమటివైపునకు తిరిగి గంగ మైదానముమీద పర్వతము వెంబడి వీచును. కాబట్టిఇచ్చటి వారికి మాన్సూన్ తూర్పునమండి వీచునట్లగుపడును. ఇట్లువీచుటచేత సిక్కీము మొదలు కాశ్మీరము వరకు పొడుగునను చిన్నకొండలమీద ప్రతి దినము వర్షము కురియుచుండును. కాని, పడమటికి పోయినకొలది పవనము నందు తేమ తగ్గిపోవుటచేత వర్షము తగ్గుచుండును. పెషావరువద్ద 5 అంగుళము లకు దిగును. వర్షవితరణయందు అరేబియన్ సముద్రపు శాఖకంటె ఇదియే

మేలయినది. వర్షమంతయు కొండలవద్దనే కురిపించి పొడిపవనములుగా దేశముమీద వీచుటకు బదులు వర్షమును అస్సాము బంగాళా దేశములకును సింధు గంగా మైదానమునకును కొనిపోవుచున్నది. ఈపవనము హిమాలయమును దాటి పోకుండుటచేత పర్వతపు ఆవలి భాగమునకు వర్షములేదు. కొండ పట్టణమగు ముర్రీ (Murree) వద్ద 30 అంగుళములు కురియును. పర్వతమునకు అవలనుండు లే (Leh) వద్ద 1 అంగుళము కంటె యెక్కువ లేదు. ఈ కారణముచేత అనగా వాయువునందు తేమ తగ్గిపోవుటచేత హిమరేఖ ఉత్తరమునకు పోయినకొలది యెక్కువ యెత్తునకు పోవుచుండును. దీనిని విశదపరుపుము.

ఈ క్రింది జాబితావల్ల సాధారణముగా మాన్సూన్ పవనము ఏయే భాగమునకు యెప్పుడు తగులుచూ తెలియుచున్నది.

| భాగము | ఋతుపవనమారంభమగు తేది | |
|---|---|---|
| మలబారు | జూన్ | 3 |
| బొంబాయితీరము | .. | 5 |
| దక్కను | ... | 7 |
| మధ్యపరగణాలు | ... | 10 |
| మధ్య ఇండియా, రాజపుత్రస్థానము, బెంగాల్ బీహార్ | ... | 15 |
| సంయుక్తపరగణాలు | | |
| తూర్పుభాగము | ... | 20 |
| పడమటిభాగం | .. | 26 |
| తూర్పుపంజాబ్ | .. | 30 |

## ఋతువులందు మానవ వ్యాపారములు

వేసవికాలమునందు వేడిమి అధికమగుటచేత నీరంతయు ఆవిరైపోవును. అప్పుడు చెఱువు లెండిపోవును. గనుక చేపలు పట్టుట ఒక పనియగును. చలికాలమున పెట్టిన పంట ఇపుడు కోతకు వచ్చుటచేత పొలముల మీదనే ధాన్యమును విడదగొట్టి ఆరబోసి గరిసెలకు యెత్తి పెట్టుదురు, ఇదంతయు వేసవికాలము అధికముకాక మును పేజరుగును. వేడిమి యెక్కువగుట చేత జనులేమి పశువులేమి పక్షులేమి సొమ్మసిల్లి పడియుండును. నీటిసప్లయి తగ్గిపోవుటచేత మంచినీరు దొరకక,

దొరికిన మురికినీటినే త్రాగవలసి యుండును. వేడిమిచేత కలిగిన బలహీనమునకు తోడు త్రాగెడు మురికినీరు కలిసి కలరా జాడ్యమునకు కారణమగును, యిందుకు జతగా జనులకుండు మూఢ విశ్వాసము వలను, జాడ్యకారణము తెలియక పోవుటచేతను, తగిన చికిత్స నొందక జనులు చనిపోవుచుందురు




ఇట్లు వేడిమికి పరితపించుచు, వర్షమెప్పుడు వచ్చునాయని తహతహ పడుచుండ వర్షము వచ్చునటుల మబ్బులు క్రమ్ముకొని ఉరుములు మెరుపులతో గడబిడలు కలిగించి తుదకు ఉత్తదయి జంతువులకు నిరాసకలిగించి. కడపట ఋతుపవనము బలముగా వీవనారంభించినపుడు వర్షము కురియ మొదలుపె

ట్టును. వేడిమితగ్గును, చెరువులందును నదులందును బావులందును నీరుచేరును. రోగములుతగ్గును ప్రజలు వెలుపలకు వెళ్ళి తమకార్యములుజరుపమొదలును పెట్టుదురు. సేద్యగాండ్రు భూములు దున్న మొదలుపెట్టుదురు. పచ్చిక అంతటను పెరుగుటచేత పశువులు మేసి బాగుగా పాలిచ్చును. లోకమున కంతకును నెమ్మది కలుగును. ఇటుగాక ఈఋతుపవనకాలమునందు తగినంతవర్షము కురియకపోయినయెడల క్షామముకలిగి జననాశము కలుగును. దీని నాపుటకయి నీటిసప్లయి ప్రయత్నములు జరుగుగాక.

B. చలికాలపు ఋతుపవనము: చలికాలమునందు సూర్యుడు క్రమముగా దక్షిణముఖము వెళ్ళి మకరరేఖ చేరునుగదా. అనగా ఉత్తరార్ధగోళమందు సూర్యునికిరణములు ఏటవాలుగా తగులును. ఆస్ట్రేలియాకు నిట్టనిలువుగా కిరణములు తగులుటచేత ఈఖండపు మధ్యభాగము మిక్కిలి వేడియయి స్వల్పపీడన ప్రదేశమగును. మనదేశపు మధ్యభాగము అతిపీడనప్రదేశమగును కాబట్టి మనదేశమునుండి పవనములు దక్షిణపువైపునకు వీచును. ఈపవనము ఈశాన్యవైపుగా వీచుటచేత ఈశాన్యఋతుపవన మనియు, చలికాలమున వీచుటచేత శీతకాలపు ఋతుపవనమనియు పేర్లు. ఇది సుమారు అక్టోబరు మొదలు జనవరివరకు వీచును. బంగాళాఖాతముమీదుగా వీచునపుడిందు కొంత ఆవిరిచేరి అది తూర్పుతీరమున వీచునపుడు నెల్లూరు మొదలగు దక్షిణపు జిల్లాలకు వర్షము నిచ్చును. కావుననే తిరునల్వేలి మొదలగు తూర్పుతీరపు పట్టణములందు వర్షము చలికాలమునకాని కురియదు. ఈక్రిందిజాబితాలోని

యంశములు బాగుగ గమనించినయెడల పయిని చెప్పబడినవిషయములు సుల భముగ బోధపడును.



జాబితా బి.

వర్షపాతము (అంగుళములలో)

| | అడుగుల ఎత్తు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కరాచి | 49 | 0 6 | 0.3 | 0.2 | 0.2 | 0.1 | 0.2 | 3.1 | 1 8 | 0.9 | 0.1 | 0 1 | 0.2 | 7.5 |
| హైదరాబాదు | 66 | 0 2 | 0.1 | 0.1 | 0.2 | 0.1 | 0.4 | 2.8 | 3.2 | 0.8 | ... | 0,1 | ... | 8.0 |
| క్వెట్టా | 5,501 | 1 6 | 1.9 | 2.4 | 1 3 | 0.5 | 0.1 | 0 8 | 0.6 | 0.2 | 0.1 | ... | 0.4 | 9 9 |
| జాకోబాబాదు | 186 | 0.2 | 0.2 | 0.5 | 0.2 | 0.1 | 0.1 | 1.4 | 1.4 | 0.3 | ... | 0.1 | 0.1 | 4 4 |
| లె (Leh) | 11,503 | 0.2 | 0.2 | 0.2 | 0.1 | 0 1 | 0 2 | 0.5 | 0.4 | 0.2 | 0.5 | ... | 0.1 | 2.7 |
| పెషావరు | 1,110 | 1.6 | 1 2 | 1 8 | 2 0 | 0.7 | 0.3 | 1.7 | 2.0 | 0 8 | 0.2 | 0.6 | 0.5 | 13.5 |
| ముర్రి | 6,344 | 2.8 | 3.4 | 3.7 | 4.3 | 3.8 | 2.4 | 11 0 | 14.0 | 6.1 | 0.2 | 1.7 | 1.2 | 56.8 |
| లాహోరు | 732 | 0.7 | 1.1 | 1 1 | 0.6 | 0.9 | 1 8 | 7.4 | 4.6 | 3.4 | 0 6 | 0.2 | 0.5 | 21.9 |
| సిమ్లా | 69,53 | 2.8 | 2.7 | 3.0 | 2.8 | 4.7 | 7.9 | 19 3 | 18.1 | 6.0 | 1 4 | 0 3 | 1.1 | 70.1 |
| ఢిల్లీ | 718 | 1.0 | 0.5 | 0 7 | 0,4 | 0.7 | 3 4 | 8.5 | 6.9 | 4.5 | 0.5 | 0 1 | 0.4 | 27 6 |
| అబు | 3,045 | 0 2 | 0.4 | 0.1 | .. | 1.0 | 5.1 | 22.2 | 22.5 | 9.1 | 2.1 | 0 2 | 0.2 | ·3 1 |
| లక్నో | 369 | 0 8 | 0.3 | 0.3 | 0.1 | 0.9 | 5.0 | 10.8 | 10.4 | 7.1 | 1.4 | ... | 0 5 | 37 6 |
| అలహాబాదు | 307 | 0.9 | 0.4 | 0.4 | 0.2 | 0.3 | 4.6 | 11.9 | 9.6 | 6 7 | 2,3 | 0 2 | 0.2 | 37.6 |
| పాట్నా | 179 | 0 7 | 0 5 | 0·3 | 0.3 | 1 6 | 7 1 | 11.0 | 10.1 | 7.9 | 2 9 | 0.2 | 0.2 | 42.3 |
| ఆగ్రా | 555 | 0.5 | 0.3 | 0.2 | 0.2 | 0.7 | 2.9 | 9.8 | 7 6 | 4.3 | 0 4 | ... | 0.2 | 26.2 |

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| డార్జిలింగు | 6,912 | 0.7 | 1 2 | 2.4 | 3.7 | 7.1 | 241 | 30,5 | 26,0 | 17,8 | 6,4 | 0,2 | 0,2 | 120,3 |
| కలకత్తా | 18 | 0 4 | 1.0 | 1.3 | 2 3 | 5.6 | 11.8 | 13,0 | 13,9 | 10,0 | 5,4 | 0,6 | 0,3 | 65,5 |
| చిట్టిగాంగు | 87 | 0.4 | 1.2 | 1.9 | 4.6 | 9.2 | 23.8 | 222 | 20,5 | 14,1 | 5,7 | 1,6 | 0,6 | 185,8 |
| చిరపుంజి | 4,455 | 0.6 | 2.6 | 9.0 | 29.6 | 50,0 | 110 0 | 120,5 | 78,9 | 57,1 | 13,6 | 1,8 | 0,3 | 474,0 |
| కటకము | 80 | 0.4 | 0.6 | 1.1 | 1.5 | 3,2 | 10.7 | 12,6 | 11,2 | 9,8 | 5,8 | 1,0 | 0,5 | 58,4 |
| జబ్బల్ పూరు | 1,851 | 0 6 | 0.5 | 0.5 | 0 2 | 0 5 | 8.5 | 18,6 | 13,8 | 8,2 | 1,5 | 0,4 | 0,3 | 53,6 |
| నాగపూరు | 1,028 | 6.6 | 0.4 | 0.6 | 0.5 | 0.8 | 8 8 | 13,3 | 8,9 | 7,5 | 2,3 | 0,4 | 0,5 | 44,9 |
| పూనా | 1,819 | 0.2 | ... | 0 2 | 0 6 | 1 6 | 5,6 | 6,6 | 4,1 | 4,3 | 4,1 | 0,8 | 0,2 | 28,3 |
| బొంబాయి | 37 | 0.1 | .. | ... | .. | 0,5 | 20,8 | 24,7 | 15,1 | 10,8 | 1,8 | 0,5 | 0,1 | 74,4 |
| మహాబలిష్వర్ | 4,550 | 0.4 | 0.1 | 0.4 | 0 9 | 1,4 | 47,3 | 102,1 | 68,6 | 32,9 | 5,8 | 1,1 | 0,4 | 261,4 |
| బళ్ళారి | 1,455 | 0.1 | .. | 0.6 | 0 8 | 1,8 | 1,8 | 1,3 | 2,3 | 3,7 | 3,9 | 1,0 | 0.3 | 17,6 |
| బెంగుళూరు | 2,981 | 0.2 | 0 1 | 0.6 | 1 3 | 5 0 | 3,2 | 4,0 | 5,9 | 6,3 | 6,4 | 1,9 | 1,7 | 35,6 |
| భీమునిపట్టణం | 30 | 0.3 | 0.5 | 0.2 | 0.2 | 2 0 | 3,2 | 3,6 | 4,4 | 6,3 | 8,1 | 2,5 | 1,3 | 32,6 |
| విజయనగరం | | 0 2 | 0.5 | 0 8 | 0.4 | 2 6 | 4,3 | 5,0 | 6,6 | 7,7 | 8,4 | 2,2 | 1,6 | 40,3 |
| బందరు | 10 | 3.3 | 0.1 | 0.3 | 0,1 | 1.7 | 4,4 | 5,6 | 6,0 | 6,5 | 8,8 | 4.0 | 0,7 | 38,5 |
| రాజమండ్రి | 68 | 0 2 | 1.3 | 0.3 | 0.9 | 3.3 | 4,5 | 7,2 | 6,6 | 7,1 | 6.5 | 1,7 | 0,2 | 38,8 |
| కడప | 477 | 0 1 | .. | 0.2 | 0.3 | 1.6 | 2,6 | 3,5 | 5,1 | 5,8 | 5,3 | 3,1 | 0,7 | 28,3 |
| మదరాసు | 22 | 1 0 | 0.3 | 0 4 | 0.6 | 2.2 | 2,1 | 3,8 | 4,4 | 4,7 | 10,8 | 13,7 | 5,1 | 49,1 |
| తిరుచనాపల్లి | 275 | 1.0 | 0.5 | 0.7 | 1.8 | 3,8 | 1,3 | 2,2 | 4,4 | 5,3 | 7,8 | 5,2 | 3,1 | 37,1 |
| సికిందరాబాదు | 1,787 | 0 3 | 0 1 | 0 7 | 1.7 | 1,4 | 3,7 | 6,0 | 5,7 | 5,2 | 3,3 | 0,8 | 0,3 | 28,3 |

| | అడుగు లయెత్తు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కడలూరు | 20 | 1,0 | 0,3 | 0,4 | 0,9 | 1,5 | 1,4 | 2,3 | 5 1 | 4,7 | 8,1 | 14,1 | 5,7 | 45,5 |
| తూతుకుడి | ... | 1,1 | ,6 | 0,8 | 1,3 | 0,9 | 0,1 | 0,2 | 0 4 | 0,7 | 3,7 | 8,1 | 2,2 | 20,1 |
| మధుర | 484 | 0,7 | 0,4 | 0,6 | 2,0 | 2,8 | 1,6 | 1,7 | 4,7 | 4,5 | 8,7 | 5,1 | 2,2 | 3,5 |
| మంగుళూరు | 52 | 0,2 | 0,1 | 0,1 | 2,0 | 8,1 | 37,8 | 37,9 | 23,1 | 11,3 | 8,0 | 1,9 | 0,5 | 13,1 |
| కొచ్చి | 11 | 0,9 | 0,7 | 2,1 | 4,4 | 12,7 | 30,7 | 22 7 | 12 4 | 9,4 | 12,1 | 5,1 | 1,9 | 115,1 |
| కొలంబొ | 40 | 3,0 | 1,7 | 5,5 | 8,8 | 13,2 | 8,2 | 5,5 | 4,5 | 4,9 | 12,9 | 12,7 | 6,4 | 87,3 |
| త్రికోణమలి | 175 | 6,2 | 2,4 | 1,3 | 1,6 | 2,3 | 1,9 | 2,2 | 4 2 | 4,6 | 8,9 | 13,1 | 132 | 61,8 |
| కాండి | ... | 5,0 | 2,6 | 3,1 | 6,9 | 6,7 | 9,1 | 7,8 | 6,2 | 5,8 | 11,3 | 11,6 | 8,4 | 84,5 |
| రంగోన్ | 41 | 0,2 | 0,1 | 0,1 | 1,8 | 10,9 | 18,4 | 21,3 | 18,6 | 16,3 | 8,1 | 2,1 | 0,1 | 99 |
| మోల్మీన్ | 94 | ,, | 0,1 | 0,1 | 3,0 | 79,7 | 38,4 | 43,9 | 43,0 | 30,3 | 8,4 | 1,5 | 0,1 | 188,5 |
| అక్యాబ్ | 15 | 0,1 | 0,2 | 0,5 | 1,6 | 12,2 | 51,6 | 51,0 | 38,6 | 23,0 | 12,4 | 3,9 | 9,6 | 195,7 |

## ప్రశ్నలు.

1. పైజాబీతాలో నుండు పట్టణములను పటమునందు గుర్తుపెట్టుము! 2. గంగమైదానమున నుండువానిని తూర్పునుండి పడమటివరకు క్రమము తప్పక వ్రాయుము? వీని వర్ష పరిమితిని గురించి యేమి కనబడుచున్నది? కారణమేమి? 3 ఇటులే సింధు మైదానమునందుకూడ యేర్పాటుచేయుము! 4. మలబారుతీరమున నుండు పట్టణము లెవ్వి? వీనియందు వర్షమెట్లుండును! 5. చెన్నపురి మధ్యజిల్లాలలో వర్షము తక్కువగదా! కారణమేమి? మధ్య పరగణాలలో వర్షము తక్కువకా డెందుకు? 6 తూర్పుతీరముననుండు పట్టణములను వ్రాసి అందు కురియు వర్ష పాతమును చూపుము? 7. ఈపట్టణము లందు ఏనెలలో ఎక్కువగా వర్షము కురియును? ఎందుకు? 8. మంగుళూరు నందు 37-8 అంగుళముల వర్షము కురియునపుడు మధురయందు అంత తక్కువ యేందుకు కురియుచున్నది? 9 బొంబాయివద్దనే పూనా ఉన్నదికదా వర్ష పాతమునందు భేదమెందుకు? 10. పూనావద్ద బెంగుళూరువద్దకంటె వర్షపాతము తక్కువగా నుండుటకేమి కారణము! 11 వర్షము కురియుటకు ముందు మనదేశస్థితి యెట్లుండును? 12. మనదేశమున వర్షపునీటిని వృథా పోనీయ్యకుండుట కేమిసాధనములు? 13 లాకులనగా (Locks) నేమి? ఇవి కట్టుట యెందుకు? 14. ఋతుపవనములు దేశమునకంతకు ఒకమారుగా తగులుట లే దెందుకు? 15. ఏభాగమున కిది మొదట తగులును? 16 హిమరేఖ అనగా నేమి! హిమాలయ పర్వతమును దాటి ఉత్తరమునకు పోయినకొలది ఇదియెందుకు యెత్తగుచున్నది? 17 సింధుదేశపు శీతోష్ణస్థితి ఆదేయక్షాంశ (అక్షాంశ) యందుండు తూర్పుభాగములకంటె ఎందుకెక్కువ వైపరీత్యముగ నున్నది! 18. దక్కనుపీఠభూమియొక్క నిమ్నోన్నతములకును అచటివర్ష పాతమునకు ఏమిసంబంధము! 19. బర్మా దక్కనులందలి వర్షపాతమును గుఱించి తారతమ్యమును విశదపరుపుడు? 20. ఆరావళి (Aravalli) కొండలు తూర్పు పడమరలు వ్యాపించి యుండిన యెడలను, పడమటి కనుమలే లేకుండినయెడలను మనదేశ మెటులమారును?

## స్వాభావిక ప్రదేశవర్ణనము

శీతోష్ణస్థితులను గురించియు, వాని ననుసరించియుండు ఋతుపవన వర్షపాతములను గురించియు ముందు చెప్పియున్నాము. ఇక మన దేశము లోని స్వాభావిక ప్రదేశముల గురించి కొంత చెప్పెదము.

హిమాలయపర్వత ప్రదేశము: ఈపర్వత ప్రదేశము సుమారు 200 మైళ్లు వెడల్పున దాదాపుగా 1,500 మైళ్లు తూర్పుపడమరలు అద్భుతముగా వ్యాపించియున్నదికదా. ఇదియొక పర్వతపంక్తి కాదు. శాఖోపశాఖలు కలిగి అధికము మూడుపంక్తులయినను కొంచెమెచ్చుతక్కువగ సమాంతరముగనున్నవి ఈపర్వతము లందలి శిఖరములు మిక్కిలి ప్రసిద్ధి కెక్కినవి. గౌరీశంకరు శిఖరము (Mount Everest 29,000 అడుగులు. ఎన్నిమైళ్లు?) కంటె ఎత్తైన శిఖరము ప్రపంచమున లేదు. కాంచన గంగ (Kinchinganga బంగారు నీరు 28,000 అడుగులు) ధవళగిరి (తెల్లనిపర్వతము 26,000) ముఖ్యమయిన శిఖరములు. ఇవిగాక పడమటిభాగమున నంగపర్వతము నందాదేవి, త్రిశూలము అను శిఖరములున్నవి. వీనికీ పేర్లు యెటులవచ్చినవి?)

వేసవికాలపు ఋతుపవనము (Monsoon) వల్ల విశేషముగ వర్షము కురియునని చెప్పితిమికదా. తూర్పుభాగమునందు పడమటి భాగమున కంటె వర్ష మధికముకదా. పర్వతపు పైభాగములు హిమరేఖకు పైగా నుండుటచేత ఇచట నీరంతయు హిమరూపమున నుండునుకదా. కాననే హిమాలయపర్వత మని పేరు. క్రిందిభాగములందు కురిసిన వర్షమంతయు క్రిందికి ప్రవహించి నదులరూపముగ సాగర సముద్రము చేరుచున్నది. మన హిమాలయ పర్వత విషయమున నొకచిత్రమున్నది. దీనివెనుక భూమియగు టిబెటు దేశము (త్రివిష్టపము) ఉన్నతమైన భూమి యగుటచేత ఈ పర్వతములందు పుట్టు నదులన్నియు కడపట మనదేశములోనికే ప్రవహించుచున్నవి. మనపడమటి కనుమలు అట్లుకావు పడమట వర్షించిన జలము పడమటికిని, తూర్పున వర్షిం

చినజలము తూర్పునకును ప్రవహించును, కాన హిమాలయపర్వతము నిజమయిన జలవిభాజకము (Water parting) కాదందురు.

ఇంతపొడుగును ఇంతవెడల్పును కలిగి ఇంత యెత్తయిన శిఖరములుగల పర్వతములనుండి ఇన్నినదులు ప్రవహించునని చెప్పతరమా! వేలకొలది యున్నవనుటయందేమియు అతిశయోక్తిలేదు. అయినను గంగ, యమున, సింధు, బ్రహ్మపుత్రానదులు ముఖ్యమయినవి. ఈనాలుగునదులు దాదాపుగా సమీపముననే పుట్టునుకాని పారునపుడు ఒకదానినొకటి సమీపించకపారును. వీనినిగురించి వెనుక చెప్పెదము.

ఇందుండుశిఖరములలో గౌరీశంఖరు శిఖరము అత్యున్నతమయినదని చెప్పితిమికదా. ఇది దూరమునుండి చూచినవారికి కొంత తెల్లగాను కొంత నల్లగాను కనబడుచుండుటచేత దీనికి గౌరీశంకరుల పేరు పెట్టియున్నారు. భగీరథుడు తన తపోమహిమచేత గంగను ఆకాశమునుండి తెచ్చెననియు, ఆమెను భరించువారెవరును లేకపోవుటచేత, అతడు శివునిగూర్చి తపస్సు చేసెననియు, పరమదయామయుడగు శివుడు భగీరథుని తపమునకు మెచ్చి ఆకాశగంగను తనజటాజూటమున నిలిపి,మరలభగీరథుడు తపముచేయగా శివుడు కరుణించి గంగను తన జటాజూటమునుండి కొంచెముగా వదలెననియుమనపూర్వికపుస్తకములందు చెప్పబడియున్నది. ఇదియంతయు ప్రకృతిశాస్త్రప్రకారము సత్యముకాదు గాని ప్రకృతిశాస్త్రవిషయమునే ఈవిధముగా కల్పించి పామరులకు తెలియునట్లుచెప్పిరేమోయని తలపవలసియున్నది. ఏదియెట్లున్నను సూర్యునితాపముచేత సముద్రములోని నీరు ఆవిరియై ఋతుపవనముతో కలిసి ఆకాశమార్గమున వెళ్ళి గౌరీశంకరు మొదలగు పర్వతశిఖరములయందు వర్షించుట నిజము. ఉన్నతపర్వత శిఖరములందు నీరు హిమముగా పేరిపోవుటయు నిజము. తరువాత సూర్యునివేడిమి తగిలినపుడు ఈహిమము కరిగి నీరై నదిలోనికి ప్రవహించుటయు నిజము. కాబట్టి ఇట్టిపర్వతమునబుట్టు నదులందు వేసవికాలమునకూడ నీరుండుటసహజముకదా! చలికాలమునందు నీరంతయు పేరిపోయి బ్యాంకు (Bank) లో

చేసినసొమ్మువలె పదిలముగా నుండును. అవసరమైనపుడు బ్యాంకునుండి పైక ముతీసికొందుమో ఆవిధముననే మనకు శ్రమలేకయే వేసవికాలమున నీటి సప్లయియగుచుండును. ఇందుచేత గంగానదీ ప్రదేశములందు కఱవులు రావు.

ఈపర్వతములయొక్క పైభాగమునందు చలి అధికమగుటచేత హిమము పేరియుండునని చెప్పితిమికదా. ఇచటిచలికి యే మొక్కయు పెరుగదు క్రిందికికొంచెము దిగినపుడు అక్కడ నాచు మొదలగు తక్కువజాతి మొక్కలుండును. ఇంకను క్రిందికి వచ్చితిమేని సరగుడుజాతిమొక్క లుండును. అడుగుభాగమున వేడిమి అధికముగ నుండును గనుక దట్టమైన అరణ్యములుండును. ఈ యరణ్యములలోని చెట్లయొక్క ఆకులు నేలరాలుటచేత పర్వతముమీద కురిసిననీరు ఝల్లున క్రిందికి ప్రవహింపక కొంచెము కొంచెముగా దిగజారుచుండును కాబట్టి ఈ యరణ్యపువాళ్లు నీటిసప్లయిని సరి (Regulate) చేయుచున్నవి. ఇచటి అరణ్యములందుండు ఫరన్ (Ferns) లు పెద్దచెట్లవలెనుండును. వెదురుపొదలమాట చెప్పనక్కఱయేలేదు. ఇందుచేత కలప విస్తారముదొరకుననుట నిశ్చయము.

బ్రిటిషుప్రభుత్వము వచ్చినతరువాత పర్వతపువాళ్ళయందు మెట్లు మెట్లుగానుండువోట్లు బార్లి (Barley) గోధుమపంటలు వేయుచున్నారు. ఇందుచేత పర్వతముమీద పొడుగునను వేయియడుగుల యెత్తువరకు పచ్చని తివాసివేయబడినట్లు అగుపడుచుండును, తూర్పుభాగమునందలి వాళ్లయందు నిరంతరము వాన కురియుటచేత తేయాకుపంట విస్తారముగ నుండును. తేనె కూడదొరకును.

నదులు పర్వతములనుండి ప్రవహించుటచేత పర్వతము కరిగి, అరుగుటచే నేర్పడిన సన్నపుమన్ను నదులద్వారా మైదానములందుచేరి భూమికి యెరువుగా నేర్పడుచున్నది అనగా ఈ పర్వతము భూములకు మంచి యెరువు సప్లయిచేయునని యర్థము. పర్వతములనుండి ప్రవహించు నదులకు జలపాతములుండుటచేత వానినుండి నీటిశక్తిని తీయవచ్చును ఇప్పటికిఈశక్తి ఉపయోగమునకు రాలేదు కాని కాశ్మీరదేశమునందు జీలమునది జలపాతమునుండి

విద్యుచ్ఛక్తిని తీయుప్రయత్నము లిపుడిపుడు చేయుచున్నారట.

**జంతువులు:** మానవుల కుపయోగకరమగు జంతువు లిందుయెక్కువగాలేవు. ఏనుగులు పులులు మొదలగునవి అడుగుననుండుఅరణ్యములందున్నవి. ఈప్రాంతములందు ముఖ్యమయినజంతువు యాక్ అను జడలబఱ్ఱె. దీని దేహముమీఁద అపరిమితముగా ఉన్ని మొలచుటచేత నది యెంతటి చలికయినను తాళి, కొండదారులమీఁద బరువులు మోయుచుండును. దీనిపాలేవీరికి ముఖ్యాహారము. దీనిమాంసము మిక్కిలి రుచిగనుండునట. దీనిని పెంచుట కష్టముకాదు. దానిఆహారము అదే సంపాదించుకొనగలదు. కాన ఎంతబీదవాఁడైనను వీనిని భరింపగలడు. దీని ఉన్నిచేత ముతకబట్టలు నేయుదురు.

**జనులు:** పంటలు విస్తారముగాలేని ఈపర్వత ప్రదేశమందు జనసమ్మర్దముండదుకదా! తూర్పుభాగముననుండువారు చైనా టిబెట్ వారలను పోలియుందురు. నడుమనుండువారు మనదేశస్థులవలెనుందురు. పడమటిభాగముననుండువారు ఆఫ్గనిస్థానము మొదలగు మహమ్మదీయదేశములకు సమీపముగానుండుటచేత వారివలెనుందురు.

**హిమాలయపర్వత మహిమ:** ఈమహాపర్వతము చూచువారలకు భ్రమ కలుగజేయునంతటి గంభీరముగ నుండును. ఇందలి సీనరి యిట్టిదని వర్ణింపతగముకాదు. ఈ పర్వతముల చూచుటకై విదేశీయు లెందరు వచ్చుచుందురో యెవరు చెప్పగలరు ?

ఇది యట్లుండనిండు. ఇందు పుట్టునదులు యెంత మేర భూమిని సలవంతము చేయుచున్నవో గమనించిన యెడల ఈపర్వతముల మహిమ యిట్టిదియని యూహింపవచ్చును. ఈపర్వతములనుండు జలపాతములు 'ఓభారతీయులారా! ప్రకృతిశాస్త్రముల నభ్యసించి ప్రకృతిశక్తులను వశపరచుకొని వర్షమునకు సాహాయ్యకారణములగు వృక్షములను పాడుచేయుటకుబదులు మమ్ముబంధించి మావలన దీపములు వెలిగించి యంత్రములు త్రిప్పించి పంటలు పండించుకొనుడు' అనునట్లు ధ్వనిచేయుచు దుముకుచున్నవి.

గంగాది నదుల మైదానములందుచేరు ఒండుమన్ను దీని నుండివచ్చి నదేకదా? ఇట్టి మహోన్నతమైనట్టియు జనులకు జీవ నాధారమగు ఈ హిమాలయ పర్వత మహిమను కొనియాడ నెవరితరము! ఇందు గౌరీశంకరు లున్నారనియు, కిన్నర కింపురుషులు, ఋషులు, మొదలగు వారున్నారని యు, తలంచి వీని నతిపవిత్రముగా చూచుటయుం దేమి యాశ్చర్యమున్నది,! వీనిని చూచి అద్భుతము నొంది సృష్టికర్తయైన పరాత్పరుని దయాసామ ర్థ్యముల కొనియాడని మానవు డెవడుండును.

ఈ పర్వత భాగమునందు మూడు స్వతంత్ర రాజ్యములున్నవి.

(1) కాశ్మీరము: ఇది హిమాలయ పర్వతమునకును హిందూకూష్ పర్వతమునకును నడుమనుండు పర్వతపులోయ. దీనియందు హిమముచే కప్పబడియుండు పర్వత పంక్తులనేకములున్నవి. ఇందుచేత ఇందలిలోయల గుండ అనేక నదులు ప్రవహించును. ఇందు సింధునదియును జీలము నదియు, జిల్జిట్ నదియు ముఖ్యములు. సింధునది పడమటి వైపునకు ప్రవ హించి నంగపర్వతమువద్ద దక్షిణమునకు తిరిగి హిందూదేశమున ప్రవహించు చున్నది. జిల్ జిట్ (Gilgit) నది ఉత్తరము నుండి సింధు నదిలోనికి ప్రవహించుచున్నది. జీలము నది కాశ్మీరములో ముఖ్యమయినది. ఇది పడమటనుండు కొండలలో పుట్టి వంకరటింకరగా పశ్చిమోత్తరమునకు ప్రవహించి కొండల సందున బారములా (Baramula) వద్ద గండిగుండ ప్రవహించును. ఇచ్చట గండి యెత్తున నుండుటచేత గొప్ప చెరువు వలె నీరు నిలుచును, అపు డందుండు మన్ను నేలకు దిగజారుటచేత ఒండుమన్ను క్రిందచేరును. ఇందుచేత నీలోయ మిక్కిలి ఫలవంతమైనది. కాశ్మీర దేశములో నిదిఒక చిన్నభాగమే కాని నడుమనుండు ఫలవంతమగు లోయ యు, చుట్టుప్రక్కలనుండు పర్వత పంక్తులను కలిపి దీనికి వర్ణింపరాని

అందము నిచ్చుచున్నవి. కానసే దానికి ఆనందదాయకమగు కాశ్మీరపులోయ (Happy valley of Kashmir) యని పేరు. దీనిని చూచుట కెందరో యూరోపియనులు వెళ్లుచుందురు. ఇది 90 మైళ్ళ పొడవును 20 మైళ్ళ వెడల్పును గలిగి 6000 అడుగుల యెత్తున నున్నది. ఈ లోయయందు ఊలూరు సరస్సున్నది. దీనిగుండ జీలము నది ప్రవహించుచున్నది మనదేశములో నిదియే పెద్ద మంచినీళ్ళ సరస్సు. (మిగిలిన సరస్సు లెక్కడ నున్నవి.)

శీతోష్ణస్థితి: ఇది యెత్తున నుండుట చేతను, చుట్టునను హిమముండు పర్వతము లుండుటచేతను, ఇచట వేడిమి తక్కువగ నుండును, చలికాలమున చలి అధికమగుటచేత కాశ్మీరదేశపు చెఱువులు కొంతవఱకు పేరిపోవును. కాని ఇచట ఋతుపవనము తగులకపోవుటచేత (ఎందుకు?) వర్షము చాల తక్కువగ నుండును. కాన ఇచటి పంటలలో గోధుమలు, యవలు, కాయధాన్యములు ముఖ్యములు. కాశ్మీరపు లోయలో ఆపిల్ పండ్లు (సీమరేగుపండ్లు) పీచి (Peaches) పండ్లు, ద్రాక్షపండ్లు, అపరిమితముగ పండును.

జనసంఖ్య: క్లయిమేటు మంచిదయినను పర్వతమయమగుటచేత జనసంఖ్య మిక్కిలి తక్కువగ నున్నది. ఈదేశపు హిందువులు పర్వతములలో నివసింతురు. వీరికి డోగ్రాలని పేరు. ఇచటి జనులలో 3 భాగములు మహమ్మదీయులు. మనదేశమునందలి అన్నిభాగములకంటె ఇచట చల్లగ నుండుటచేత దీనిని యూరోపియనులు మెచ్చుకొందురు.

పట్టణములు. శ్రీనగర్ జీలము గట్టున నున్నది. పూర్వమిది మహమ్మదీయ చక్రవర్తులకు వేసవికాలపు విడిదిగా నుండినది. ఇది చూచుట కింపుగా నుండినది. పూర్వమిచట శాలువలు తయారగుచుండినవి కాని ఇపుడీ పరిశ్రమ క్షీణదశలోనున్నది. ఇప్పటికిని పంజాబు ఉత్తరకాశ్మీరము టిబెట్టు

లకు వెళ్ళు వర్తకులదారి ఈపట్టణముగుండ వెళ్ళుటచేత ఇది ముఖ్యపట్టణముగ నున్నది.

జమ్ము (Jammu) ఇది పర్వతముల క్రింద నున్నది. రైలుదారి ఇక్కడ నిలిచిపోవుచున్నది.

లే (Leh) పట్టణము లడక్ జిల్లాలో నున్నది. కారకోరము కనుమగుండ తూర్పు టర్కీస్థానమునకు వెళ్ళువారు ఇచటినుండి ప్రయాణము చేయవలసియుండును. పర్వతముల కావల నుండుటచేత ఇచట వర్షము లేదు.

కాశ్మీరదేశ ప్రాముఖ్యము. జీలము, చీనాబ్. రావి, సింధు, సట్లెజ్ నదులు ఈదేశమునందే పుట్టి పెరుగుచున్నవి. కాన ఇక్కడినీరే పంజాబును, సింధుమైదానమును ఫలవంతముగ చేయుచుండుట! శ్లయిమేటు మంచిదగుటచేత యూరోపియను లిక్కడ స్థిరముగా నివసింపవచ్చును. అప్పుడు వారుగూడ మనతో కలిసి మనదేశమునకై ఎక్కువ బాటుపడుదురు.

నేపాళదేశము భూటానుదేశము హిమాలయపర్వత సమీపమునసున్నవి. ఇవి రెండును స్వతంత్రరాజ్యములు.

2 సింధు గంగానదీ ప్రదేశములు. ఇవి హిమాలయపర్వతపు ఈవియనియే చెప్పవలయును. ఇందలి నీరు ఇక్కడి ఒండిమన్ను లేకుండిన యెడల ఈమైదానము లంత ఫలవంతములుగా నుండవు. ఇవి ఉత్తరమున హిమాలయ పర్వతము మొదలు దక్షిణమున వింధ్యకొండలవరకును తూర్పున బర్మాదేశము మొదలు పడమట సులేమాన్ పర్వతములవరకును వ్యాపించియున్నవి. వీనివైశాల్యము 7,76,100 చ॥ మైళ్ళు ఈ మైదానమంతయు నొకటిగానుండక ఆరావళీ పర్వతము మొదలుకొని హిమాలయము వరకు నుండు కొంచమెత్తుప్రదేశముచేత రెండుభాగములుగా నున్నది. ఒకటి గంగ మైదానము (2) సింధుమైదానము.

35-వ పటము



గంగ, సింధునదులు

(A) గంగమైదానము. గంగానది పారు ప్రదేశము గంగమైదా

నము. ఈ నది మధ్యహిమాలయమునందు గంగోత్రిహిమానీనద మున పుట్టి గోముఖము నుండి చిన్నప్రవాహముగా బయలుదేరుచు న్నది. ఉత్పత్తిస్థానమువద్ద అన్ని నదులవలె నిదియును చిన్నదిగా నుండును. దీనివెడల్పు 30 అడుగులకంటె యెక్కువ యుండదు. లోతు రెండు అడుగు లుండును. ఈ ప్రకారము 180 మైళ్ళదూరమున నుండు హారిద్వారము చేరువరకును దీనియందు మంచుకరుగుడు నీళ్లే చేరుచుండును. ఇంతవరకు దీనికి భగీరథి యని పేరు. ఇక్కడ నదికడ్డముగా నొక ఆనకట్ట కట్టి యున్నారు. ఈ నీరంతయు పంటకాలువలగుండ ప్రవహించి భూములను సాగుచేయుచున్నది. ఇక్కడివరకు దీనిని పర్వత ప్రవాహమని చెప్ప వచ్చును.

హారిద్వారమువద్ద గంగానది మైదానములకు దిగెనని చెప్పితిమి. ఇక్కడినుండి అలహాబాదు (ప్రయాగ) వరకు పారి అచట దీని ఉప నదియగు యమునతోనిది కలియుచున్నది. ఈయమునానదియు గంగవలె నే హిమాలయమునందు పుట్టి గంగకు కొంచెము దూరమున దక్షిణమునకు ప్రవహించుచున్నది. ఇది గంగకంటె పెద్దది. పొడుగైనది. ఈనది మైదా నమునందెక్కువదూరము పారుటచేత దీనిజలములో చాలభాగము సాగు బడికి పోవును. కనుక గంగలోకివచ్చు నీరు కొంచెమే యుండును. ఈనీటి యందంతగా మన్ను ఉండదు గనుక నీరు నల్లగ నుండును. గంగ నీరుమురికిగ నుండును. ఈరెండును అలహాబాదువద్ద కలియునప్పుడు కొంతదూరము నీరుకలిసి పోకుండ ఒకచోట మురికిగను ప్రక్కనునల్లగను నీరు ప్రవహించు చుండును. ఈ యమునానదిలోనికి దక్షిణమునుండి చెంబల్ ఉపనది వచ్చును. ఈగంగానది అలహాబాదునుండి సముద్రము చేరులోపల ఉపనదు లెన్నియో ఇందు చేరును. ఇందు ముఖ్యమైన గండకి.గోగ్రా నదులు పెద్దవి. గండకి,యందు సాల్గ్రామములు దొరుకునట.

గంగోత్రిహిమానీనదము



ఇట్లు పర్వతములనుండి ఉపనదులు తెచ్చుకప్పములను గైకొని ఈ నది 1,500 మైళ్లదూరము ప్రవహించి గార్గో కొండలదగ్గర దక్షిణమునకు తిరిగి డెల్టావద్ద పాయలై సముద్రము చేరుచున్నది. ఈ డెల్టావద్ద నేల మిక్కిలి చదునుగ నుండును, నీరున కెట్లు పారవలసినది తెలియకుండును గనుక ఒకగడ్డిపోచ సయితము నీటి దారిని మార్పగలిగియుండును. కాన నది నానాముఖముల సముద్రములో సంగమ మగుచున్నది ఈశాఖలయందు హుగ్లీ ముఖ్యమైనది. ఇచట నీరు నిలుకడగ ప్రవహించుటచేత మన్నంతయు నేల చేరుచుండును. కాననే డెల్టాయేర్పడుట. ఈ డెల్టాయొక్క అడుగు భాగమందు సుందరీవృక్షములు అపరిమితముగ పెరుగుటచేత దీనికి సుందరీ వనమని పేరు. ఈపేరే ఇంగ్లీషునందు సుందర్బన్ (Sundarban) అయినది. ఈవనమునందు పులులు, మొసళ్ళు, పాములు విశేషముగ నుండుటయేగాక వాయు వెప్పుడును తడిగనుండుటచేతను, తగ్గనేల అగుటవలన వేడిమి అధికముగ నుండుటచేతను ఇది జ్వరాదులకు పుట్టినిల్లుగ నున్నది. ఇందలి పులులు మనుష్యులను, గొడ్లను చంపుట స్వాభావికమే గాని నిరంతరము కాలువలుదాటుట అలవాటుగలవగుటచేత ఇవి వీలయినపుడు చేపలను బట్టుటకూడ కలదు.

గంగానదికి తోడు బ్రహ్మపుత్రా నదికూడ గోలండూ వద్ద డెల్టాకు నీటిని మంటిని తెచ్చుచున్నది. ఇది మొత్తము మీద పర్వత ప్రవాహమగుటచేత ఇందు మన్నెక్కువ యుండును. ఈబ్రహ్మపుత్రానది పర్వతములనుండి ప్రవహించునపుడు ఈనీటివేగ మెక్కువగుటచేత ఇది గంగనీటిని అపుజేసి సముద్రములోనికి ప్రవహించును గంగలోని నీరు నిలిచిపోవును. గంగలోని మన్ను దిగజారును. ఇందుచేత గంగానదీశయ్య రానురాను ఎత్తగుచున్నది.

1912 సెప్టెంబరునెల 27-వ తేది 'హిందూ' వార్తాపత్రికలో హుగ్లీ నదినిగురించి ఇట్లు వ్రాయబడియున్నది. "హుగ్లీ నదిలో నీరుతక్కువయి

నది. లోతులేకపోవుటచేత విపత్తులు సంభవించుచున్నవి. కిద్దర్‌పూరు (కలకత్తాలోని భాగము) నుండి డైమండ్ హార్బరు వరకును త్రవ్వవలసిన ఓడకాలువను (Ship Canal) గురించి అందరు మాటలాడుచున్నారు. దీనికి యెక్కువ వ్యయము కావలసియుండినను కొద్దికాలములో ముఖ్యావశ్యకమగునని తోచుచున్నది.

బ్రహ్మపుత్రానది: మానససరోవరతీరమున పుట్టి హిమాలయము వెంబడి టిబెట్ దేశమునపారి తూర్పున గండిగుండ ప్రవహించి 550 మైళ్ళు అస్సాముదేశములో పారి అక్కడనుండి గంగలో కలియుచున్నది. ఈనది రెండు భాగములు టిబెట్టులోను ఒకభాగము ఇండియాలోను పారుచున్నది. దీని కిరుప్రక్కలను సాగుకు తగిన చదునుభూమి లేకపోవుటచేతను ఇది పర్వతములనుండి దుముకుటవలన ప్రవాహవేగ మధికముగ నుండుట చేతను. ఇచ్చట ఆనకట్ట కట్టలేదు. కాని నదీశయ్య (Bed) ఎత్తగుచుండుటచేత వెల్లువలు వచ్చినపుడు ప్రక్కభూములమీద ఒండుమన్ను చేరి భూమిని సారవంతముగ చేయుచున్నది.

శీతోష్ణాదిస్థితులు, పంటలు: ఈ మైదానమంతయు సముద్ర మట్టమునకంటె విశేష మెత్తున నుండకుండుటచేత వేసవికాలమున వేడిమి యెక్కువగ నుండుననియు, జూను నెల మొదలు సుమారు నవంబరు నెల వరకు వేసవికాలపు ఋతుపవనము వీచుననియు, అందుచేత కాశీపర్వత (Kasi Hills) ప్రదేశమునందును, అస్సాము నందును, వర్షము విస్తారముగా తూర్పుభాగమునకు పోయినకొలది వర్షపరిమితి తగ్గుచుండుననియు చెప్పితిమిగదా. కాబట్టి వర్షాధిక్యముచేతను, నదులనుండి ప్రవహించు నీటిచేతను తూర్పుభాగమునందు తేమ యెక్కువగ నుండును. ఇందుచేత ఇచటి ఉష్ణోగ్రత సంవత్సరము పొడుగునను గొంచెమెచ్చు తక్కువగ నేకరీతిగా నుండును. ఇట్టిదానికే సమత్వపుక్లయిమేటు (Equable) అని పేరు. కాబట్టి ఇచట వరిపంట ముఖ్యమైనది. జనుము రెండవది. అరటితోటలు

టెంకాయవనములు వెదురు పొదలు మొదలుగాగల వృక్షములు అమితముగ నున్నవి. నేల చదునగుటచేత ఎచ్చట చూచినను గుంటలు చెరువులుండును. వీనియందు అల్లి, తామర, అంతర్తామర మొదలగునవి పుష్పించి కన్నులపండువు చేయుచుండును. చేపలు మెండు. సమీపముననుండు అడవులందు జిగురు, మూలికలు, రెసినులు (Resins) విశేషముగ దొరకును, అస్సాము లోని పర్వతపువాళ్ళయందు తేయాకుపంట విశేషము.

ఇందు జనసమ్మర్దము మెక్కువ నుండుననుటకు సందియము లేదు. కాని వృక్షములచాటున పల్లెలుండుటచేత పల్లెలున్నట్లుగుపడవు. తేమ యధికముగుటచేత ఆరోగ్య విషయమున ఈభాగమంత మంచిదికాదు. జనులలో చాల మంది వ్యవసాయము చేయువారు జనుపనారనేతయు, నల్లమందు చేయుటయు, తేయాకు తయారు చేయుటయు మిగత వృత్తులు. రాణిగంజి వద్ద నేలబొగ్గు గనులనుండి తీయుచున్నారు. సమీపమున నుండు కలకత్తాకిది యెగుమతి యగుచున్నది.

పట్టణములు : కలకత్తా నగరమునందు జనసంఖ్య 11,05,0000 ఇది మొన్నటివరకు మనదేశమునకు ముఖ్యపట్టణముగ నుండినది. ఇందుచేతను, నదీముఖద్వారమునకు సమీపమున నుండుటచేతను, సమీపమున నేలబొగ్గు దొరకుటచేత మ్యానుఫాక్చరులు ప్రబలి జనసంఖ్య యెక్కువయినది. విదేశపు కంపెనీలు బలమైనవి. సౌధములనగరమను పేరెంతయు దీనికి తగియున్నది ఇది మొదట బెస్తపల్లెగానుండి బ్రిటీయులగు ఇంగ్లీషువారి ప్రభుత్వకాలమున అత్యున్నతదశకు వచ్చినది. ఇక్కడనుండి ఇనుపదారుల శాఖలు నానాముఖములకు పోవుచున్నవి నీటిప్రయాణ సౌకర్యము ఇట్టిదని చెప్ప పనిలేదు. (కలకత్తాచీకటి గదియేమి?)

పాట్నా పట్టణము గంగానదిమీద నున్నది. దీనికే పాటలీపుత్రమని పేరు. ఇచట దొరతనమువారి నల్లమందు ఫ్యాక్టరీ లున్నవి.

గయ : గొప్పయాత్రాస్థలము. ఇచట పూర్వము బుద్ధుడు తపము చేసిన మఱ్ఱిచెట్టు కలదు.

డక్కా: పూర్వము మహమ్మదీయ రాజుల ముఖ్యపట్టణముగానుండి నది. ఇందు నయమైనవని ప్రసిద్ధిచెందిన డక్కామజ్లిన్ బట్టలు నేయఁ చుండెడివారు కాని యంత్రపు నేతబట్టల ముందర నిలువజాలక ఇవి నశించి పోయినవి. ఇపుడిచట జనుము నంచుల నేత జరుగుచున్నది.

గోలండూ వద్ద గంగ బ్రహ్మపుత్రానదులు కలియుచున్నవి. అందుచేత ఈరెండు నదులగుండ జరుగు వ్యాపారము ఈపట్టణము ద్వారా జరుగును. కాన ఇది ప్రాముఖ్యమునకు వచ్చినది.

చిట్టగాంగు: ముఖ్యరేవుపట్టణము. ఇక్కడినుండి తేయాకు, నంచులు కలప, వడ్లు రొగుమతి యగును.

B. ఈమైదానమునకు పైభాగమున నీరంత యధికముగ నుం డదు వాయువు కొంచెమెక్కువ పొడిగనుండును. కాన వేసవి కాలమున వే డిమి అధికమయినను చలికాలమున క్లయిమేటు హాయిగను ఆరోగ్యముగను ఉండును. తూర్పుభాగమున కంటె వర్షము తక్కువయినను నదులవల్ల కావల సిన నీటిసప్లయి యున్నది. ఇవి లేనిచోట పంటకాలువలున్నవి

ఇచట వరిపంట తక్కువగను గోధుమపంట యెక్కువగను ఉన్నది. ఇది చలికాలమున పండును. ఈపంటయందు పంజాబు మొదటిది. ఇది రెండ వది. చమురు విత్తులు ప్రత్తి నీలి పంటలున్నవి. గసగసాలపంట యెక్కువ, సుమారు 1,200 చదరపుమైళ్ళభూమి ఈపంట క్రిందనున్నది. ఈకాయలమీద గీచినపుడు బొప్పాయికాయ (పరంగికాయ పరామిదపుకాయ) మీద కాట్లు వేసినపుడెటుల పాలుకారునో ఆవిధముగా ఈకాయలనుండి కారును ఇట్లు కారినపాలు పేరి గడ్డగనగును. ఇదియె నల్లమందు లేక అభినిమందు. దీనినుండి లాడనము అను ద్రావకమును తీయుదురు. దీనిని మందులలో వాడుదురు.

ఈభాగమునందు 485 లక్షల జనులున్నారు ఇందు నూటికి సుమారు 13-మంది మహమ్మదీయులు ఇది తూర్పు భాగమునకంటె యెక్కువ ఆరో గ్యమైనభాగమగుటచేత ఇందు జన సమ్మర్ద మెక్కువగనున్నది. హిందీ ముఖ్య భాష.

వృత్తులు. జనులు సేద్యము చేయువారు. కాన వీరందరు పల్లెలలో నుండువారు మ్యానుఫ్యాక్చర్లు కొన్నియున్నవి. కాన్పూరు నందు నూలు ఉన్ని బట్టలు తోలుసామానులు తయారగుచున్నవి కాశీపట్టణమందు ఇత్తడిపాత్రలుచేయుదురు. పాట్నా ఘాజీపూరులంగు నల్లమందు తయారగుచున్నది

పట్టణములు: ఇక్కడి పట్టణములన్నియు రాకపోకల కనుకూలములగు నదులవెంబడినే పూర్వ కాలమునుండి యున్నవి మిక్కిలి చదునుగల ప్రదేశమగుటచేత ఈయింద్రప్రదేశమునందంతటను రైలుదారులు యెక్కువగు నున్నవి.

అలహాబాదు: గంగ యమునానదుల సంగమస్థలము కాబట్టి పవిత్రమయిన స్థలము దీనికి ప్రయాగ యని పేరు. దీనిసమీపమునధారాగంజి యను గ్రామమున్నది. యాత్రికు లిచటికి తరుచుగా వెళ్లుదురు ఇచట ప్రతి మాఘమాసమునందును మాఘోత్సవము జరుగును. అపుడు జనులు లక్షల కొలది మూగుదురు. ఇచట మ్యానుఫ్యాక్చరు లేవియు లేవు. కాని సరకులు యెగుమతి దిగుమతులు నదులద్వారా యెక్కువ జరుగుచున్నవి. ఇది సంయుక్త పరగణాలకు ముఖ్య పట్టణమగుటయు, ఇందు కళాశాల యొకటి యుండుటయు గమనించవలసిన అంశములు.

కాన్పూరు: మ్యానుఫ్యాక్చర్లకు ముఖ్యమైనపట్టణము దీని ప్రాముఖ్యమునకు కారణము మ్యానుఫ్యాక్చర్లే. ఇచట నూలు ఉన్ని, జనుముయంత్రములున్నవి. తోళ్ళపనులు జరుగుచున్నవి. సైన్యమునకు కావలసిన బూట్లు, జీనులు ఇక్కడనే తయారగుచున్నవి. ఇందుకు కారణము చుట్టుపట్లనుండి చర్మములు సులభముగా ఎగుమతియగుటయే. తయారైన సరకులన్నియు ఇనుపదారులమూలమున, నదులమూలమునను ఎగుమతి యగుచున్నవి ఇందుచేత వర్తకులు, బ్యాంకుదారులు మొదలగువారు అనేకు లిచట చేరియున్నారు. కావున ఇచటి జనసంఖ్య యెక్కువగుచున్నది.

ఇండియను మ్యూటినీ జరిగినప్పుడు అది ఇచటికి కూడ వ్యాపించినది.

కాశీ. దీనికే వారణాసి యని పేరు. ఇది పురాతనపట్టణము. పూర్వ



మునుండి పవిత్రమైన పట్టణమని ప్రసిద్ధిచెందినది. కావున సంవత్సరముపొడు గునను యాత్రీకులు వెళ్లుచుందురు. ఈ పట్టణముయొక్క ప్రాముఖ్యమున కిదియొకకారణము. (2) ఇది ఫలవంతమగు మైదానమున నుండుటచేత సరకు యెగుమతి దిగుమతి యగుచుండును. ఇచట దివ్యజ్ఞాన సమాజమువారొక కళా శాలను స్థాపించియున్నారు. అదియిపుడు విశ్వవిద్యాలయమయినది సంస్కృత కళాశాలకూడ గలదు. ఇం దనేక అన్నదానసత్రము లున్నవి.

ఆగ్ర. ఈపట్టణము మొగలాయి చక్రవర్తుల కాలమునుండి ప్రసిద్ధిగాంచినది, ఇందనేక పార్కులు లున్నవి. తాజ్ మహాల్ (Tat Mahal) మిక్కిలి ప్రసిద్ధిచెందినది. ఇది శుద్ధమయిన చలువరాతితో కట్టబడి అద్దమువలె ప్రతిబింబముల నిచ్చుచున్నది.

ఇది గొప్ప ధాన్యపు సంతయగుటచేతను, దూదిమిల్లులు తోళ్ళ కారు ఖానాలు ఉండుటచేతను, యెక్కువ ప్రసిద్ధి నొందుచున్నది. షహారన్ పూరు నందు బొటానికల్ తోటలును, రూర్కీ యందు యింజినీరింగు కాలేజియు నున్నవి హరిద్వారము, అయోధ్య, యాత్రాస్థలములు,

## సింధు మైదానము

గంగ మైదానమునకును సింధుమైదానమునకును నడుమ జలవిభాజక స్థల మున్నది. జలవిభాజక స్థలమనగా నీటిని రెండువైపులకు పారునట్లు చేయు ఎత్తయిన భాగము. దీనిని ఇంగ్లీషులో వాటర్ పార్టింగ్ (Water parting) అందురు. ఇది హిమాలయ పర్వతముల వెంబడి ఉత్తరముగా వ్యాపించి యున్నది. ఉత్తరభాగమున ఇది యెత్తయినది కాదు. కావున ఒక మైదానమునుండి మరియొకదానిలోనికి పోవుట సుల భమే. ఇందుచేతనే ఈ రెండు నదుల మైదానములను ఒకటిగా భావించి సింధు గంగ మైదాన మను పేరు వాడుచున్నారు.

గంగ మైదానమునకును సింధు మైదానమునకును భేదమున్నది. (1) గంగ మైదానమునందు వర్షమెక్కువ కురియుచున్నది. తూర్పుభాగమున

వర్షము పరిమితమనియు ప్రస్తుతమునకు పోనుపోను వర్షము తగ్గుచునియుండు చెప్పితిమి కదా, సింధునదివిషయమై యిట్టిది గాదు ఇచ్చట వర్షము తక్కువగా కురియును. దక్షిణభాగమునందు ఒక యుపనదియైనను ఇందు కలియుటలేదుకదా. ఇది ప్రవహించునపుడు నీరు ఇంకిపోవుచుండును. (2) గంగానదికి పర్వతపదము అంత పెద్దదికాదు. సింధునది సగముదూరము పర్వతములందె ప్రవహించు చుండును. కాబట్టి ఈ నదీప్రవాహము ఎక్కువ వేగముగ నుండుననుటకు సందేహములేదు. కావున ఈ నదీముఖద్వారమున గంగానది ముఖద్వారము నందువలె గొప్ప డెల్టా లేదు. నీరు ఉరవడిగ ప్రవహించుచుండుటచేత గట్టుల నొరసి కోసికొని ప్రవహించుచుండును. డేరాగాజీఖాన్ పట్టణము స్థితి యెప్పటికిని నమ్మకములేదు. (3) ఈ మైదానమున పల్లెలులేకుండుటచేత పండిన జనులందరు నదివెంబడినుండు పట్టణములందే యున్నారు. గంగమైదానమునందు నీటినష్టము తగినంత యుండుటచేత దానివెంబడి గ్రామములనేకములున్నవి.

ఉత్పత్తి: సింధునది మానససరోవర తీరమున నుత్పత్తియయి పర్వతముల వెంబడి వాయవ్యమూలగా నంగపర్వత శిఖమువరకు ప్రవహించి కడపట దక్షిణముగ ఇండియాలోనికి తిరుగుచున్నది. ఇచట ఆఫ్ఘనిస్థానమునుండి వచ్చు కాబూల్ నది కలియుచున్నది. తరువాత సింధునది దక్షిణమునకు సాల్టు రేంజి (Salt Range) నుండి సింధు హైదరాబాదువరకు మైదానమునందు ప్రవహించుచున్నది. అటు తరువాత ఈనది డెల్టా చేరి శాఖోపశాఖలుగా సముద్రములో కలియుచున్నది. పైభాగమున ప్రవహించునపుడు జీలం, చీనాబ్, రావి, బీయాస్. సట్లెజ్ నదులు ఇందు కలియుచున్నవి. ఈ నదియొక్క పొడవు సుమారు 1,8000 మైళ్లు.

పైభాగమున అనగా హిమాలయ ప్రాంతమున 5 నదులు సింధు నదిలో కలియుచునని చెప్పితిమికదా. ఈయైదును చేతివ్రేళ్ల వలె పటమున

కనిపించును. ఇవన్నియు హిమాలయములయందే పుట్టుటచేత వసంతకాలమున మంచు కరిగియు వర్షము అంతయు నదులగుండ ఇండియాలోనికి ప్రవహించును. వీనియందు నీరు నిరంతరము ఉండుటను సందేహముండదు, అయినను ఈ నదులు పర్వతప్రవాహములగుటచేత నేలలు లోతుగా కోసికొని పోయి యున్నవి. కాన ప్రక్కభాగమునకు నీరెక్కదు. అందుచేతనే పర్వతములనుండి దిగు ప్రదేశమువద్దనే ఆనకట్టలుకట్టి కాలువలద్వారా నీరు సప్లయి చేయుచున్నారు. ఇందుచేత కాలువలు చిక్కని వలత్రాళ్ళవలె అడ్డదిడ్డముగాను అద్భుతముగాను ఉన్నవి.

ఈ నదులు పర్వతసీమలందు ప్రవహించుచుండుటచేత వీని ప్రక్కలు నిలువుగానుండుటయేగాక ఇవి ఉరవడిగ ప్రవహించుచుండును. యిందుచేతనే పర్వతప్రవాహములకు వంతెనలుకట్టుట దుస్తరము. అదియునుగాక జనసమ్మర్దము తక్కువగుటచేత అట్టివంతెనలుకట్టుటవలన లాభములేదు కావున నిట్టిచోట్ల పేముతీగెల వంతెనలను త్రాళ్ళవంతెనలను యేర్పరచుచున్నారు. ఇవి మనుష్యులకుపయోగించును కాని బండ్లకు పనికిరావు. ఇవిగాక కొన్నిచోట్ల గాలినింపిన తోలుసంచులనే పడవలుగా నుపయోగింతురు సాధారణపు చెక్కపడవలు రాళ్ళకుతగిలి పగిలిపోవునని తోలుసంచులను ఉపయోగింతురు.

ఈ నదులన్నిటిలో సట్లెజ్ నది ముఖ్యమయినది. ఇది యెచట పుట్టుచున్నది? ఇది 15,200 అడుగుల యెత్తునపుట్టి పర్వతమును భేదించుకొని సింలాకు 60 మయిళ్ళదూరమున ప్రవహించునపుడు 3,000 అడుగులు క్రిందికి దిగును. ఇది యేపట్టణమువద్ద సింధునదిలో కలియుచున్నది? జీలమునది కాశ్మీరదేశమునకు ముఖ్యమయినది. ఇది యెచట పుట్టుచున్నదో చూడుము? ఇట్లు వంకరటింకరగా ప్రవహించుచు బారాముల్లా వద్ద యిరుకయిన పర్వతపుగండినుండి ఇది పారవలయును. కనుక పయిన నీరునిలిచి విశాలమయిన చెరువువలె చుట్టుభూమి నాక్రమించుకొనుటచేత మన్నంతయు అడుగున చేరి సారవంతమయిన లోయ అయినది. ఇదియే కాశ్మీరపులోయ. ఇందుచేతచేయాలో

యు మిక్కిలి ఫలవంతమయినది. ఈప్రకారముగా నేర్పడినదే వ్యూలూరు సరస్సు. జీలమునది దీనిగుండ ప్రవహించుచున్నది. ఇట్లు లోయలచేతను సరస్సులచేతను, పర్వతపంక్తులచేతను శోభిల్లుచుండు నీకాశ్మీరదేశమువంటి స్వాభావిక (పీనరీ) దర్శనీయసంపదగల భాగము మరియొకటిలేదని యాత్రికుల నేకులు ఇచటికి వెళ్ళుచుందురు. వేసవికాలమందు మైదానములన్నియుమలమల మాడుచుండునపు డిచట చల్లగాను రమ్యముగాను ఉండుటచేత యాత్రికులు వేసవికాలమునసే యెక్కువగా వెళ్ళుదురు.

సింధునది పంజాబును విడిచినతరువాత సింధుదేశముగుండ ప్రవహించునపుడొక యుపనదియయినను దీనిలో కలియుటలేదు.ఎందుకు? అయినను ఈనది పారుప్రదేశమంతయు ఫలవంతముగ నున్నది. కాన సింధుదేశము సింధునది యొక్క ఈవియని చెప్పవలసియున్నది.

ఇక్కడనుండి సముద్రము చేరునపుడిది డెల్టాగుండ అనేకశాఖలుగా పోవును. దీనిముఖమున ఏదయిన రేవుపట్టణమున్నదా ? దూరముననుండు కరాచి యెందుకు ప్రాముఖ్యమునకు వచ్చినది ?

క్లయిమేటు. (శీతోష్ణస్థితి). ఋతుపవనములను గురించి చెప్పునపుడు అరేబియా సముద్రశాఖాపవనము సింధుదేశముమీద వీచినను పర్వతములెవ్వియు లేనందున వర్షము కురియుటలేదని చెప్పితిమి. కాబట్టి యిచటివాయువు మిక్కిలి పొడిగనుండుటచేత మండు వేసవిలో ఉష్ణోగ్రత యెక్కువగుచున్నది. జకోబాబాదు పట్టణమున 120 డిగ్రీల ఉష్ణోగ్రత యుండుట సర్వసామాన్యము.

ఉత్తరభాగమునందు అనగా పంజాబునందు వేడిమి అధికమే కాని యంత యెక్కువగా నుండదు. ఇచట వర్షము గంగానదీప్రదేశమునందువలె యెక్కువ కురియదు. కాని నదులు పంటకాలువలు పారుటచేత చెట్లుచేమలు పెరిగియుండును గనుక వేడిమి యధికము కాకుండుటకిది కారణము. గాలి మెంత్తముమీద పొడిగనుండుటచేత చలికాలమునందు మిక్కిలి చలిగను యెం

డకాలమున మిక్కిలి వేడిగను ఉండును. లాహోరు నందు వేసవికాలమున 117 డిగ్రీల యుష్ణోగ్రత యుండును. చలికాలమున రాత్రులందు నీరు పేరుకొనుటయు కలదు. కావున దీనిక్లయిమేటు విపరీతపు క్లయిమేటని (Extremes of climate) యే చెప్పవలయును. అక్కడినుండి తూర్పునకు వెళ్ళినకొలది నేల యొక్కవ తేమకలదగుటచేత వాయువునందు తడి యెక్కువగుచుండును. కాన ఈవైపరీత్యము తగ్గుచు క్లయిమేటు సమత్వమునకు వచ్చుచుండును. కావున కలకత్తాయొక్క క్లయిమేటు సమత్వపు క్లయిమేటని (Equable climate) చెప్పబడుచున్నది.

కాలువలు. పైనిచెప్పినదానినిబట్టి ఉత్తరభాగము అనగా పంజాబు దేశమునందు వర్షమంత అధికముగ లేదని తెలియుచున్నది. కాని యచటి పంటకాలువ లెంతయో మేలుచేయుచున్నవి. ఇవి రెండురకములు (1) నిరంతరము పారునవి వీనిలోనికి పర్వతములవద్దనుండియే నదుల నీరు పారుచుండును. అందుచేత వీనిలోని నీరు తరుగకుండును (2) వెల్లువకాలువలు, ఇవి నదుల క్రిందిభాగమున త్రవ్వబడినవి. మొదటివానిలోనికి నీరెల్లప్పుడు ప్రవహించుచుండును. రెండవవానికి నదులు పొర్లి పారినకాని నీరెక్కదు.

ఇందు ముఖ్యమైన కాలువలు. (2) జీలముకాలువ, జీచ్‌దూయాబులో పారును (2) చీనాబ్‌కాలువ, రక్నాదూయాబులో పారును,(3) బారీదూయాబ్‌ కాలువ రావీనుండి వచ్చును. (4) సర్‌హిండ్‌కాలువ సట్లెజ్‌ నదినుండి ప్రవహించి దీనికి తూర్పుభాగమునకు నీటినప్లయి చేయును. (5) యమునా నదినుండి ప్రవహించు పడమటి యమున కాలువ తూర్పు పంజాబునకు నీటి సప్లయి చేయుచున్నది. ఈ పంటకాలువలు కాక యింకను కొన్నికొన్ని క్రొత్తవి యోచనలోనున్నవి. ఇవి తయారైనయెడల సింధుసాగర్ దూయాబునకు నీటిసప్లయి యధికమగును.

వేసవి కాలమునందు మాత్రము నీటిపారుదలగల భూములందు వరి, చెఱకు, పంటలు పండుచుండును. చలికాలమున నేల తేమగా నుండుటవలన గోధుమ పండబెట్టి వేసవి కాలారంభమున కోయుదురు. ఈప్రాంతపు పంటలలో ముఖ్యమైనవి ఇవియే. వేసవి కాలమున కొంతవరకు ప్రత్తిపండును, సాలాటు పంక్తిలోని నునుపుగా ఉష్ణము వేయును. ఇది మనదేశపు ఉష్ణపుపంటిది కాదు. పెద్దపెద్దకాల్వలవలె నుండును. గడ్డపారలతో గాని త్రవ్వి చేయుట కష్టము. ఉత్తర హిందూస్థానములో దీనికే వాడుచున్నారు.

దక్షిణభాగమున సింధుదేశమునందు వర్షము లేదుకదా. పంటలు ఏమనిపెరుగును? ఆధునికమున ఇక్కడి కాల్వలు నయమైన ప్రత్తిపంట వేయుచున్నారు. గోధుమకంటె కొద్దిగా పండును.

## పట్టణములు

ఢిల్లీ. ఇది ఏదెసగట్టున నున్నది? మన హిందూ రాజులకేమి మొగలాయీలకేమి పూర్వమునుండి ఇది ముఖ్యపట్టణముగా నుండెను. షాజహాన్ చక్రవర్తి కాలమున ఇంతనేక హర్మ్యములు కట్టిరి వీనిలో జుమ్మా మసీదు, కాలామసీదు, షాజహాన్నగరు ఎక్కిలి యందము లైనవి ఇచటి చాంద్నిచౌక్ వీధి మిక్కిలి సొగసైనది ఈపట్టణమునుండి రైలుదారులు అన్నివైపులకును పోవుచున్నవి. ఇది పూర్వ మెట్లుండెడిదో కాని ఇప్పుడు మనదేశమునకు రాజధానియగుటచేత దీనివైభవము ఇకముందు అగుపడును. రాజధానికి తగినటులుండులాగున పెద్దపెద్ద ఇంజనీరులు కలిసి ఈమహాపట్టణపు నిర్మాణము నేర్పాటు చేయుచున్నారు.

లాహోరు. ఈపట్టణము ఏనదిగట్టు నున్నది? ఇది పంజాబునకు ముఖ్యపట్టణము. ఇందంతగా మాన్యుఫాక్చరులు (యంత్రపరిశ్రమలు) లేవు కాని జరిపనిమాత్రము కొంతజరుగుచున్నది.

మిగిలిన పట్టణము లెన్నియో యున్నవి. అమృతసరస్సు సిక్కుల యాత్రాస్థలము. ఇది ఆపేరుగల సరస్సుచుట్టును కట్టబడి యున్నది.

కాలువ లిచటతయారగుచున్నవి. దీనిగుండ కాశ్మీరు ఆఫ్గనిస్థానముల వర్త

13-వ పటము




కృష్ణ, గోదావరి మున్నగు ముఖ్యనదులు

కము జరుగుచున్నది. లూధియానా నుండి శాలువలు ఇంగువయు ఎగుమతి యగుచున్నవి. సియాల్ కోట్ నందు టెన్నిసు బాడ్మింటన్ బ్యాట్లు తయారుచేయుదురు.

హైదరాబాదు: సింధుదేశమునకు ముఖ్యపట్టణము. ఇది సింధునది డెల్టావద్ద నున్నది.

సింధులోయ రైలుదారి: (Indus Valley Railway) తయారయిన తరువాత కరాచీరేవుపట్టణము వృద్ధి యయినది. ఈ ప్రాంతమున పండు గోధుమపంట మే, జూన్ నెలలలో విస్తారము ఇంగ్లాండునకెగుమతియగును.

## దక్కను పీఠభూమి

ఇది త్రిభుజాకారమున నున్నదికదా. దీని యెల్లలు యెవ్వి? దీనికి మూడువైపులను కొండలవరుస ఉండకపోయినయెడల పీఠభూమి నిలిచియుండునా? తూర్పు పడమటికొండలు దక్షిణమున నీలగిరివద్ద కలిసి కన్యాకుమారి అగ్రమువరకు వ్యాపించియున్నవి. ఈపీఠభూమియొక్క వాలు యే వయిపునకున్నది? ఇది యెట్లు చెప్పగలవు? నదులన్నియు పడమటపుట్టి అడ్డముగా తూర్పునకు ప్రవహించి తూర్పుకనుమలగుండ నొకగండినిజేసికొనితూర్పుమయిదానములందు ప్రవహించి సముద్రమును చేరుచున్నవి. ఉత్తరభాగమునసుండు నర్మదాతపతీ నదులుమాత్రమే పడమటికి ప్రవహించుచున్నవి.

వర్షకాలమునందు పడమటికనుమలందు వర్షముకురిసినపుడు నీరంతయు నదులంగుండా వెల్లువలుగా ప్రవహించును. వేసవికాలమున నీరు ఎండిపోవును.

మహానది: బస్తరులోపుట్టి సంబల్పురమువద్ద వంకరగా తిరిగి ఒకగండిగుండ కటకమువరకుపారి అచట పాయలై డెల్టాగుండ సముద్రము జేరుచున్నది. దీని యుపనదులు బ్రాహ్మిని, వైతరిణి. దీనిబేసిన్ (నదీప్రాంత) ఎన్ని చదరపు మైళ్లు.

గంగ బ్రహ్మపుత్రానదుల డెల్టావలెనిదియునుండును. ఇచ్చటను వేడిమి యధిక ముగుటచేతను నీటి విస్తారము ఉండుటచేతను డెల్టాభూమి యంతయు సారవంతమై పంటలకు ముఖ్యము. ఈనది కయ్యలచుట్టునుండు గనిమల వెంబడి తాటిచెట్లు వరుసగా నుండును, దీనికి సమీపమున జగన్నాథమను పుణ్యస్థల మున్నది. ఇచటికి వేలకొలది యాత్రికులు సంతతము రైళ్ళ ద్వారా, కొన్ని కాలినడకను అంబుజాక్షమున కైనను వెళ్ళి జగన్నాథుని విగ్రహదర్శనమునకై వెళ్లుచుందురు. ఈదేవాలయ సౌఖ్యములు అనుభవించినవారికే దొరుకు. వర్ణించి చెప్పుట కష్టము.

గోదావరి: దక్షిణ నదులలోకెల్ల పెద్దది. దీని పరివాహ ప్రదేశము ఎన్ని చదరపు మైళ్లు? ఇది పశ్చిమకనుమలకు 50 మైళ్లదూరమున నుండు నాసిక కొండలలో పుట్టి సాధారణముగా ఆగ్నేయ ముఖముగా ప్రవహించుచున్నది, ఇది పుట్టుచోటున రాముడు శూర్పణఖ యొక్క ముక్కుచెవులు కోసెనట. అందుచేతనే ఆభాగమునకు నాసిక యని పేరువచ్చినది (నాసిక=ముక్కు) ఇది హైదరాబాదుగుండ పోయి తూర్పు కనుములనడుమ ఇరుకయిన యొకగండి వంటి ప్రవహించి డెల్టాముఖముగా పాయలై సముద్రము చేరుచున్నది.

ఈనదియొక్క పొడుగు సుమారు 900 మైళ్లు ఇది పారు ప్రదేశము లందు వివిధములైన సీనరీ (దర్శనీయస్థలములు) లున్నవి. మనదేశపునదులలో నేనికిని ఇటులేదు. ఇది మొదట అన్నినదులవలె చిన్న ప్రవాహముగా బయలుదేరి లోతు తక్కువగలదై ప్రవహించును ఇది నైజాంరాజ్యమున ప్రవహించునపుడిందులోనికి చిన్న యుపనదులు అనేకములు కలియుచున్నవి. అవి యెవ్వి? ఈరాజ్యమును దాటినతరువాత ఇంద్రావతి, శబరీ నదులు ముఖ్యోపనదులు. శబరి యని పేరెందుకు వచ్చినది? రామాయణకథను చెప్పుడు. దీని యుపనదులలో ఇంద్రావతి యొకటి. ఇది పారుప్రదేశమునందు నాగరికత ప్రబలియుండలేదు. ఇచట అరణ్యములందు గాండ్ జాతివా రున్నారు. ఇతరభాగములందు మార్పులెన్నియో కలుగుచున్నను, అవి అభివృద్ధి పొందు



చుండినను ఈ ప్రదేశములం దిప్పటికిని రాతిపనిముట్లు వాడుకలో నున్నవి. నాగరకతా ప్రవాహము వీరికి తగులుటలేదు. ఇచటినీనరి మక్కిలి రమ్యముగ

నుండును. ఇక్కడినుండి నదీశయ్య యిరుకగుచు (ఎందుకు) తూర్పుకను



మల (పాపికొండలు) వద్ద 600 అడుగుల వెడల్పు గండిలోనికి స్రీరంతయూ

సంకుచిత మగుచున్నది. ఇక్కడనుండి నది తూర్పుమైదానము చేరును. రాజమహేంద్రవరము దగ్గర డెల్టా ప్రారంభ మగుచున్నది. ఈనీటిని వృధా పోనియ్యకుండుటకై దొరతనమువారు ఈనదికడ్డముగ రాతితో నొక గొప్ప ఆనకట్టును కట్టి దాని ప్రక్కనుండి మూడు గొప్ప పంటకాలువలు త్రవ్వియున్నారు వీనిద్వారా 7,80,000 యెకరములభూమి సాగగుచున్నది.

ఈకాలువలు పోనుపోను అనేకశాఖలై భూములకు నీటిని ఒండుమట్టిని సప్లయిచేసి ఫలమును అధికము చేయుచున్నవి. ఇందుచేత ఇచటి జనసంఖ్య యెక్కువగ నున్నది.

కృష్ణ. దీనినీరు నల్లగ నుండుటచేత దీనికి కృష్ణ యని పేరు. ఇదియు గోదావరివలె పడమటికనుమలందు పుట్టి ఆగ్నేయముగా ప్రవహించి తూర్పు కనుమలలో నొక గండిగుండ ప్రవహించి బెజవాడ చేరుచున్నది. ఇచట నది కడ్డముగా ఆనకట్ట యొకటి కట్టబడి యుండుటచేత దీని కిరు ప్రక్కలనుండు రెండు పంటకాలువలవెంబడి నీరు ప్రవహించి దీని డెల్టాలో 22,60,000 యెకరముల భూమిని ఫలవంతము చేయుచున్నది. 16-వ ప్రతిమ ఉత్తరపెన్న యొక్క గండిని చూపుచున్నది.

కావేరి: ఇది కొడగుకొండలలో పుట్టి మైసూరునందు ప్రవహించుచున్నది. పైభాగమునందు రాతిమయమగు ప్రదేశమగుటచేత ఇది వంకర టింకరగా ప్రవహించుచున్నది, దీనిగట్లు నిట్రముగా నుండి చెట్లు చేమలచే నట్టముగ నున్నవి. మైసూరునందు ఈనది కడ్డముగ కనీసము 12 ఆనకట్టలు కట్టి నీటిని ప్రక్కకు త్రిప్పి పంటలకు నీరు కట్టుచున్నారు. పీఠభూమినుండి మైదానమునకు దిగుచోట ఈనదియందు రెండు ద్వీపములున్నవి. శివసముద్రము ఒకటి శ్రీరంగపట్టణము మఱియొకటి. శివసముద్రము వద్దనుండి మైదానమునకు దుముకు జలపాతమును స్వాధీనము చేసికొని దానినుండి విద్యుచ్ఛక్తిని దీయుచున్నారు.

ఇక్కడినుండి సముద్రము చేరునపుడు దీనియందుండు ఒండుమన్ను జిల్లాగా నేర్పడి వరి మొదలగు పంటలకు కారణమై యున్నది. ఈనదిని

14-వ పటము



దక్షిణగంగయని భావించుచున్నారు.

నర్మదా తపతీనదులు: తూర్పునపుట్టి కొండలోయలగుండ అరేబియాసముద్రము చేరుచున్నవి. ఇందు నర్మదానది మిక్కిలి పవిత్రమైనదిగా

నెంచబడుచున్నది. కాబట్టి దీని పొడుగునను దేవాలయము లనేకము లున్నవి.

ఇది మధ్యభాగములయందు చిన్నదిగానుండి వింధ్యశాతపురా కొండల నడుమ నారుచు జబ్బల్ పూరువద్ద చలువరాతి దిబ్బలమీదనుండి క్రిందికి దుముకి పిదప వెడల్పం దెక్కువయి నెమ్మదిగా ప్రవహించి సముద్రము చేరుచున్నది.

తపతినదియు నిట్టిదే. దీనిముఖద్వారమునందు సూరత్ పట్టణమున మొట్టమొదట ఇంగ్లీషువర్తకులుచేరి వ్యాపారము చేయుచుండిరి. వీరి స్వాధీనములోనికి బొంబాయి వచ్చినతరువాత సూరత్ యొక్క ప్రాముఖ్యము తగ్గిపోయినది.

**క్లయిమేటు:** దక్కను పీఠభూమి మొత్తముమీద ఉష్ణమండలములో చేరినదే కాని ఎత్తుగనుండుటచేతను ఉత్తరభాగమునకంటె ఇరుకుగా నుండి సముద్రమున చొరబడియుండుటచేతను ఇచట వేడిమి అంత విస్తారముగా నుండదు. ఇక్కడ వర్షమెప్పుడు కురియును? ఎక్కువగా కురియు ప్రదేశమేది? పడమటి కనుమలు తూర్పుభాగమున నుండిన యెడల దక్కను భూమి రీతుల మారునా?

వర్షమెక్కువగా కురియు పడమటి కనుమలందు టేకు, గంధపుచెట్లు సాల్ చెట్లు, ఇబోనిచెట్లు గల గొప్ప అరణ్యము లున్నవి. ఈయడవుల యందు ఏనుగులు కూడ నున్నవి. తూర్పుభాగమున భద్రాచలపు కొండల యందు టేకు మొదలగు కలప విశేషముగా ఉత్పత్తియగుచున్నది.

మిగతభాగములందు, చెరువులు మొదలగు నీటి యాధారములున్న చోట వరి పండుచున్నది. మిగతచోట జొన్న, సజ్జ, రాగి, మిరపకాయలు మొదలయినవి పండును. మధ్యభాగమునందు నల్లరేగడి నేలమీద కురియు వర్షము తక్కువైనను జిగటమన్ను పైభాగమున నెండి పగుళ్ళుబారియుండినను లోపలనుండు తేమ ఆరకుండుటచేత ప్రత్తిపంటకు ఎత్తిన నేలగా నున్నది. ఇచటి ప్రత్తి ముదుగైనది. నాణెమైన మల్లుపంచలకిది తగదు.

పట్టణములు: హైదరాబాదు నైజాము రాజ్యమునకు ముఖ్యపట్టణము. ఇచట నైజాముగారు నివసింతురు. దీని సమీపమున సికిందరాబాద్ అను దండు నిలుచున లమున్నది.

పూనా, లేక పునహ్: ఇది మహారాష్ట్రుల ముఖ్యస్థానము. వేసవికాలమునందు జనులనేకులిచట నివసింతురు. ఎందుకు! ఇచట గొప్ప కళాశాలయు మహిళవిశ్వవిద్యాలయములును కలవు.

తిరుపతి: శేషాచలపు కొండలమీదనుండు యాత్రాస్థలము. కొండ క్రిందనుండు పట్టణమునకు దిగువ తిరుపతి యనియు, కొండలమీదనుండు దానికి యెగువ తిరుపతియనియు పేర్లు. ఇచటికి యాత్రీకులు నిరంతరము వెళ్ళు దురు. ఈకొండలయొక్క సీనరీ (దర్శనీయస్థితి) మిక్కిలి చిత్రముగ నుండును.

బెంగుళూరు: పడమటి కనుమలకు సమీపమున 3000 అడుగుల యెత్తుననుండుటచేత చల్లగనుండును. జనులనేకులు వేసవికాలమున వెళ్ళుదురు. ఇచట మైసూరు రాజుగారి నగరున్నది. కళాశాలయొకటి పాఠశాల లనేకములున్నవి ప్రమదావన మొకటియు మ్యూజియ మొకటియు మంచి స్థితియం దుంచబడినవి. సమీపమున దండునిలుచు తావుండుటచేత ఇదియే మైసూరురాజ్యమునకు ముఖ్యపట్టణమని చెప్పవచ్చును. ఈ పట్టణమంతయు విద్యుద్దీపములచే వెలిగింపబడుటచేత రాత్రులందు ఇంద్రభవనము వలె నుండును! ఈనగరము వృద్ధియగుచున్నది.

కోలారు: బంగారుగను లుండుచోటు. ఇది ఈవల ప్రబలినది. ఇక్కడ గను లనేకము లున్నవి. ఈగనులందు పనిచేయుటకు ఇటాలియా దేశపు గనికాండ్రు వచ్చియున్నారు. ఇదివరకు ఏమియులేని ఈప్రదేశమునందు బంగారుపరిశ్రమవల్ల పెద్దపట్టణములు బయలుదేరినవి. షుమారు 80 వేల గనికాండ్ర జనలు కలవు.

ఉదకమండలము: ఇది నీలగిరికొండలమీద నున్నదికదా. ఇందుచేత వేసవికాలమునందు దొరతనమువారి కిది విడిది. ఇచటనుండు వేసవి

కాలమునందు 4 గంటలకు బయట నిలుచుట కష్టముగ నుండునంత చలిగా నుండును. ఒకప్రక్కన లోయయు ఒకప్రక్కన కొండప్రవాహము మరి యొకవైపున దట్టమగుపొదలు నాలవవైపున నీటిధారలు ఉండుటచేత సీనరీ రమ్యముగ నుండునని చెప్పనక్కఱలేదు.

## (4) తూర్పుతీరపు మైదానము

(a) తూర్పుతీరమున కన్యాకుమారిమొదలు మహానదివరకు చదునైన నేలయున్నది. దీనికిదక్షిణభాగమునందు కోరమాండల్ (చోళమండలము) తీరమనియు ఉత్తరభాగమున గోల్కొండ తీరమనియు పేరు.

ఈతీరపు మైదానమునందు నదీముఖద్వారము లున్నవికదా. ఇవి లేనిచోట నేల యిసుక తెరగానున్నది. కాబట్టి డెల్టాభూములలో పండు పంటలన్నియు ఇచట పండును. అవియెవ్వి ! ఇచట పంటలధికమగుటచేత జనసమ్మర్ద మెక్కువగ నుండును. ఇచట స్వదేశీయుల పరిశ్రమలు కనపడు చున్నవి. ఎవ్వి? కట్టుబట్టలకు తినుతిండికిని కొదువలేని ఈప్రదేశమునందు దేవుని ఆరాధించుటకుగాను దేవాలయములు కట్టియున్నారు. ఇవి గొప్ప యాత్రాస్థలములు, పూరి లేక జగన్నాథము, సింహాచలము, ద్రాక్షా రామము, మహాబలిపురము (బలిచక్రవర్తి యుండినచోటు. దీనికథ యేమి) కంచి, చిదంబరము, శ్రీరంగము, కుంభకోణము, మధుర రామేశ్వరము మొదలయినవి. ఈయాత్రాస్థలము లన్నియు పర్వతముల మీదనొ నదులగట్టుననో లేక మరియేదియైనను అద్భుతమగు సృష్టివైచిత్ర్యము కనబడుచోటనో ఉండును. దేవునియొక్క అద్భుతశక్తిని చూపించు ఈప్రదేశములందు దేవునారాధింపదలచి ఇట్టిచోట దేవాలయములు కట్టిరి కాబోలును.

## పట్టణములు

కటకము మహానదియొడ్డున నున్నది. ఈనది డెల్టాయొక్క శిరో భాగమున నున్నది. కాబట్టి ఈడెల్టాలోని పంటలన్నియు, డెల్టాలోని

జనులకు కావలసిన సరకులన్నియును దీనిద్వారా వెళ్ళవలసి యుండును. కనుక దీని ప్రాముఖ్యము. ఇనుపదారి దీనిని మదరాసు కలకత్తాలతో కలుపు చున్నది. వెండిపనులు ఇచట మేలైనవి.

విజయనగరము జమీన్దారి పట్టణము. కళాశాల కలదు,




గోదావరి డెల్టా

= కాలువలు

= ఇనుపదారి

కాకినాడ కలెక్టరుండుతావు, రేవుపట్టణమే కాని స్టీమరులు 7 మైళ్ళదూరమున నిలుచును. ఏల ? పిఠాపురము రాజావారి కళాశాలయు వారి యనాధశరణాలయమును ఇచట కలవు.

రాజమహేంద్రవరము. గోదావరి డెల్టాయొక్క శిరోభాగమునయున్నది. ఉండిననేమి ! ఈపట్టణమునకు 4 మైళ్ళదూరమున నది కడ్డముగా ఆనకట్ట కట్టియున్నారు. ఎందుకు ! దానివలన లాభమేమి ? భద్రాచలములో కలప విస్తారము కదా ! ఈభద్రాచలము సుమారు 160 మైళ్ళదూరమున నున్నది. భద్రాచలమునకు వెళ్ళు జనులు ఇక్కడినుండియే వెళ్ళుదురు. కోటిలింగాలు, ద్రాక్షారామము, కోటిపల్లి, అంతర్వేది మొదలైన యాత్రాస్థలములకు జను లిక్కడినుండి వెళ్ళుచుందురు. అయిననేమి ! భద్రాచలమునుండి యెగుమతియగు పేకుకలప యిక్కడనుంటి రైలుమార్గమున యెగుమతి యగుచున్నది. ఎందుకు ?

ఈకారణముచేత ఇచట కళాశాలలు, పాఠశాలలు, కోటులు పెట్టబడినవి. జనులిందు యెక్కువగ నుండుటకు కారణమయినది. రాజమహేంద్రవరము ముఖ్యపట్టణ మగుటకు గలకారణములను (1) వ్యాపారవిషయము (2) రాజకీయవిషయము (3) మతవిషయములను (అఖండగోదావరి) చర్చించి వ్రాయుడు.

బెజవాడ ఇక్కడ కృష్ణానదికి ఆనకట్ట కట్టియున్నారు. ఇందువలన లాభమేమి ? కృష్ణాస్నానము చేయువారు ఇచట దిగుదురు. గోదావరీతీరమున నుండునన్ని పుణ్యక్షేత్రములు లేని కారణములచేత ఇది అంత గొప్పయాత్రాస్థలము కాదు. ఇచట పతకులచే నడుపబడు విద్యాలయము కలదు.

బందరు సముద్రతీరముననున్నది, నోబుల్ కాలేజియు, జాతీయ విద్యాలయము ఇచట ప్రసిద్ధిచెందినవి.

నెల్లూరు పినాకినీనది గట్టుననున్నది, వేసవికాలమున వేడిమి యెక్కువయే గాని మిక్కిలి ఆరోగ్యకరమైన పట్టణము. పెన్నానదికిచట ఆన

కట్ట కట్టియున్నారు. కాని దీనికి పెద్దడెల్టాలేదు. అయినను దీనిక్రింద శ్రేష్ఠమయిన వరిపండును. ఇచట వెంకటగిరి రాజాగారి కాలేజియు, రంగానాయకులదేవాలయములును కలవు. జొన్నవాడ దీనికి దగ్గరనుండుయాత్రాస్థలము.

మదరాసు మన రాజధానికి ముఖ్యపట్టణము. ఇందు నూతనముగ కట్టబడిన హార్బరు ఉన్నది. దీని ప్రాముఖ్యమునకు కారణము ఇచట గవర్నరుగారును ఇతర రాజకీయోద్యోగులును ఉండుటయె. ఇది గొప్ప రైలుజంక్షన్ ఇచట కళాశాలలును విశ్వవిద్యాలయమును కలవు, దీనిహార్బరు అంత క్షేమకరమైనది కాకుండుటచేతను దీనికి వెనుకభూమి రొట్టిఫలమునయినను ఇచ్చునది కాకపోవుటచేతను దీని వ్యాపారము మిక్కిలి తక్కువగనున్నది.

తిరుచినాపల్లి కావేరీనదిమీద నున్నది. దీనిసమీపమున నుండు శ్రీరంగము గొప్ప యాత్రాస్థలము. తిరుచినాపల్లిలో మాతృభూతేశ్వరుని దేవాలయము కొండమీద నున్నది, ఇచట పొగచుట్టలు వెండివిగ్రహములు తయారగుచున్నవి.

మధుర వైఘానదిమీది యాత్రాస్థలమున. ఇందు పూర్వము హిందూరాజు లుండిరి. పూర్వపు దేవాలయములు మంటపము లిప్పటికిని ఆశ్చర్యమును కలిగించుచున్నవి. ఇచట ఇత్తడిపాత్రలు చేయుదురు. దీని జనసంఖ్య చాల యెక్కువయినది. దీనికి కారణము పెరియారు నదివల్ల జిల్లాపొందిన అభివృద్ధియే.

ఉదకమండలము 7,000 అడుగుల యెత్తుననుండు పట్టణము గవర్నరుగారు వేసవికాలమున నిచట నుందురు.

## పడమటితీరపు మైదానము

(2) కన్యాకుమారి అగ్రము మొదలు కాధియవారువరకు వ్యాపించియున్నది. ఇది తూర్పుమైదానము కంటె విశాలముగా నున్నదా? దీని

యుత్తర దక్షిణ భాగములు వెడల్పునందు దాదాపుగా సమానముగా నున్నవా? ఇట్లుండుటకు కారణమేమి? ఉత్తరభాగమున పడమటి కనుమ



శాఖలు అడ్డదిడ్డముగా వచ్చి సముద్రమును సమీపించుచున్నవి కదా. ఉత్తర భాగమునకు కొంకణతీర మనియు దక్షిణభాగమునకు మలబారు తీరమనియు పేర్లు.

ఈభాగమునందు వర్ష మధికముగ కురియునుగదా ! ఈవర్ష మంతయు యేమగుచున్నది? అంతయు సముద్రములోనికి పోకుండుటకయి కొంతభాగము నకడ్డముగా పెద్దకట్టకట్టి అచట నిలుచు నీటిని కొండలోతొలిచిన రంధ్రము గుండ తూర్పునకు పారునటుల చేయుటచేత వైఘానదిలో నీరెక్కువయుండి పంటలకు యెక్కువ సదుపాయముగనున్నది. దీనికి పెరియారు (పెద్దఏరు) అనిపేరు. ఇట్టివి మరికొన్ని కట్టించిరేని దక్కనుమధ్యభాగమునందు యెక్కువభూమి సాగునకు వచ్చును.

ఈతీరమునందలి నదులన్నియు చిన్నవికదా ! ఎందుకు ? ఇచట వర్షమధికమగుటచేతను, (100 అంగుళములు) వేడిమియెక్కువగ నుండుటచేతను వరిపంట యెక్కువగ నున్నది. ఇంతకంటెను పోకచెట్లు, కొబ్బరిచెట్లు, మిరియపుతీగెలు మిక్కిలి పేరుపొందినవి. పర్వతపువాలులయందు దట్టమయిన టేకు అరణ్యములున్నవి,

ఈభాగమునకును ఇతరభాగమునకును నడుమ యెత్తయిన పడమటి కనుమలుండుటచేత మున్నటివారకును ఈభాగముల వారితో మనకు సంపర్కములేక యుండినది. కాబట్టి మనయాచారములకును వారి యాచారములకును భేదము కలిగినది, మనవారు అదుమళయాళమనియు, వారందరు మంత్రమువేసి మనుష్యులనుకూడ కట్టివేయుదురనియు, యెన్నెన్నో పిచ్చికథలు చెప్పకొనుచుందురు. ఇందుకు కారణము వారితోడి సాంగత్యము లేకుండుటయే.

ఇచటను తూర్పుతీరమునందువలె పంటలు సమృద్ధిగా పండుటచేతజన సమ్మర్దము యెక్కువగా నున్నది.

పట్టణములు. తిరువనంతపురము (తిరువాన్కూరు) దీనినే అనంతశయన మందురు. ఇచట దేవుడు పామీమీద పరుండియున్నాడని చెప్పుదు

రు. ఇప్పటికిని ఈగుడియందు ప్రతిదినము 1,000 మంది బ్రాహ్మణులకు భో
జనము పెట్టుచుందురు. ఇచట రాజాగారి కళాశాలలున్నవి. న్యాయశాస్త్రి
ముకూడ చెప్పుదురు. ఇచట వాడుకలోనుండు నాణ్యములు బ్రిటిషు నాణ్యము
లుకావు.

కళ్లికోట్ట ఇది రేవుపట్టణము. ఇచట మంచి చెక్కగుడ్డలు తయా
రగుచున్నవి. పాలఘాట్ గండిగుండ వెళ్లురైలుదారి ఈపట్టణముచేరి ఉ
త్తరమున మంగుళూరువరకు వెళ్లుచున్నది. మంగుళూరువద్ద మంచిపెంకులు
ఇటుకలు తయారగుచున్నవి.

బొంబాయి. పడమటి కనుమలలోని బోర్ గండి గుండ రైలు
దారి వేసినతరువాత ఈపట్టణమునకు ప్రాముఖ్యము ఎక్కువయినది. అన్నిహా
ర్బరులలో ఇది శ్రేష్ఠమైనది ఎందుకు? ఇంగ్లండునకు దగ్గరనున్నది. దానివలన
లాభమేమి? కొంచెము ఆలోచింపుము. ... మనదేశమంతటికిని మధ్యభాగమున
నుండు రేవుపట్టణము. దీనివలన ప్రయోజనమేమి? పశ్చిమటినుండి ఋతుపవన
ము వీచుటచేత ఇచటివాయువు సాధారణముగా తడిగనుండును అందుచేత
నూలుదారము సులువుగా వడకవచ్చును. ఇందుచేత దూదిమిల్లులు అనేకము
లు బయలుదేరినవి. దూది యెక్కడనుండి వచ్చును? ఇచటి యంత్రపుపనులు
చూచువారికిది ఇంగ్లాండులోని పట్టణమువలె కనపడును. బొంబాయివద్ద
ఎల్లోరా ద్వీపమున్నది. ఇచట రాతిగుహాలో దేవాలయములు మలచబడి
యున్నవి. ఇవి అత్యద్భుతముగ నుండును.

బరోడా. ఇదియొక చిన్నస్వతంత్ర రాజ్యముయొక్క ముఖ్య
పట్టణము, దీనియధిపతికి గాయక్ వారు అనిపేరు. ఇందు జీతము లేక
వయిమడీవరకు అందరికిని చదువు చెప్పించుచున్నారు. ఇంకను యెన్నియో
సంస్కారములు చేయుచున్నారు.

## (7) బర్మాదేశము.

దీనికిని మనదేశమునకును నడుమ పర్వతపంక్తు లనేకము లున్నవి.
అందుచేత ఇంతవరకును బర్మాకు పోవుటకు తగిన మెట్ట ధారిలేదు. కావున

సముద్రప్రయాణము చేసితీరవలయును. కాబట్టి మొన్నటివరకును మన కిది విదేశముగా నుండునది. దీనియందు (ఐరావతమును) తెల్లయేనుగుండినదని చెప్పుకొనుటమాత్ర ముండినది కాని ఇటీవల 1866 సంవత్సరమున ఇంగ్లీషు వారు దీనిని జయించిన తరువాత భారత సామ్రాజ్యమునందు ఒకభాగమయి నది. అయినను భౌతికవిషయమును బట్టిచూడ ఇది వేరుగనుండు సొంక నైసర్గిక భాగమని కనబడుచున్నది.

దీని రేవుల్లలురెవ్వి? పొడవు వెడల్పు యెంతయుండునో లెక్కపె ట్టుము? వైశాల్యము 2,40,000 చ॥ మైళ్లు. పర్వతము లెచటనున్నవి? వరు సగానున్నవా? ఏవైపునకు వ్యాపించియున్నవి? ఈపర్వతములకును హిమాల యపర్వతమునకును ఏమైన సంబంధమున్నదా? ఎన్ని పంక్తులు కనబడుచున్నవో చెప్పుము. వాన పేర్లెవ్వి ?

క్లయిమేటు వర్షపాతములు: వేసవికాలపు ఋతుపవనము వీచునపుడు బంగాళాఖాతపు శాఖాపవనము సముద్రతీరపు పర్వతములమీద విశేషవర్షములు కురిపించును. కొంతభాగము ఐరావతీ నదీ ప్రాతమీదుగా మధ్యభాగమునకు వీచి వర్షము నిచ్చుచు పోయినకొలది పొడిపవనమగు చుండును. కాబట్టి పర్వతములందు యెక్కువ వర్షముకురియు ననియు (సుమారు 120 అం) తీరపు మైదానములందు (50) కొంచెము తక్కువగ నుండుననియు, ఏర్పడుచున్నది. ఉత్తరమునసుండు పర్వతపు ప్రదేశమున వర్షముండకపోవుటచేత క్లయిమేటు పొడిగాను శీతలముగాను ఉండును. దక్షిణభాగము వేడిగాను తడిగాను ఉండును.

వర్షమధికముగనుండు పర్వతప్రదేశమున నదులెన్నియో యుండవల యునుకదా. ఈదేశమున కురియు నీరేమగుచున్నది? హిమాలయపర్వతము నుండి గంగలోనికి నదులు ప్రవహించినట్లు ఇచటను ఒక నదిలోనికిప్రవ హించునా? గంగమైదానమువంటి మైదాన మేర్పరచుటకు వీలున్నదా ? ఇచట నదులపేర్లు చెప్పుము? ఇందు పొడుగైనదెద్ది ?

ఐరావతి: ఇది యుత్తరముననుండు పర్వతములలో పుట్టి దక్షిణమునకు ప్రవహించుచున్నది. దీని పుట్టుకస్థలమును గురించి అంతగా తెలియదు. దీనికి పడమటినుండి చిండ్విన్ ఉపనది వచ్చుచున్నది. ఇచట వర్షమధికము. ఈపర్వతములందు మంచు నిరంతరముండును. ఇందువలన లాభమేమి? దీనిబేసిన్ (ప్రవాహప్రదేశము) విశాలమైనను ఈనది మైదానము చిన్నదిగా నున్నది. ఎందుకు?

గంగమైదానము పెద్దదియా? ఇదిపెద్దదియా? ఈభేదమువలని ఫలమేమి? ఇట్లుపారి దక్షిణమున మార్టబాన్ సింధుశాఖలో సముద్రమును చేరుచున్నది. దీని ముఖద్వారమున డెల్టాయున్నది ఈనదియందు నిరంతరము నీరుండుటచేత (ఎందుకు?) ఇది 800 మైళ్లవరకును రాకపోకల కనుకూలించుచున్నది. దీనిమీద వెళ్లు నావలు సరకుల మోసికొని పోవుచు దారివెంబడి అమ్ముచున్నవి. కాన వీనిని తేలుచుండు అంగళ్లని చెప్పవచ్చును.

సాల్విన్: ఈనది ఐరావతికంటె పొడుగైనది. కాని పర్వత ప్రదేశములందే పారుటచేత అంత యుపయోగకరమైనది కాదు. దీనికి ప్రక్కలందు మైదానములేదు. ఇది రాతి తెరనేలమీద ప్రవహించుటచేత నీరింకక అంతయును సముద్రము చేరుచున్నది. దీనికి అడ్డముగా ఆనకట్టు కట్టినయెడల నీరు వృధాపోదుకదా. ఆనకట్ట యెందుకు కట్టలేదు? దీని ప్రవాహము వేగముగ నుండుటచేత ముఖాద్వారమున డెల్టాలేదు. ఎందుకు? డెల్టా యుండిన యెడల నది యెన్నియో శాఖలుగా పారునుకదా. ఎందుకు? సాల్విను నదీ ముఖద్వారము విశాలముగా నున్నది, కాని ఈనదియందు నీరు ఉరవడిగ పారుటచేత నావయాత్ర కిది అనుకూలపడుట లేదు. ఏటి మైదానములు లేమిచే పంటలు విశేషముగలేవు. అన్ని విషయములను ఐరావతియే యుత్తమమైనది.

పంటలు: ఈదేశము పర్వతమయమైనదికదా. ఇచటి మైదానము స్వల్పముకదా. పర్వతములందు వర్ష మెక్కువకదా. ఇన్ని అనుకూలములుండి

యొండ యెక్కువగుటచేత అరణ్యము లెదుగుటకు సందేహముండునా? ఈయర ణ్యమునందు టేకుకలప విస్తారము. ఏనుగులు మెండు. కాబట్టి ఈయేనుగుల చేత కలప మోయించి ఐరావతి నదిమీద రంగూనునకు చేర పంపుదురు. తరువాత ఇది ఆవిరి రంపపు మిల్లులలో కోయబడి దూలములుగాను, దంతెలుగాను, పలకలు, రీపరు బద్దలుగాను మనదేశమునకును, ఇంగ్లాండు నకును, ఎగుమతి యగుచున్నవి. ఈకలపకు చెదపురుగంట కుండుటచేతను, నయుపనులకు పనికివచ్చుటచేతను, దీనికి గిరాకి యెక్కువ. కలపయే గాక అరణ్యములనుండి రబ్బరుయెగుమతి యగుచున్నది. రబ్బరుయేమిటి? ఇదెట్లు వచ్చును? దీని నెందుకుపయోగింతురు? దీని కాపే రేల వచ్చినది? ఇచట వెదురుపొద లధికముగ నుండును. ఇవి ఎందుకు పనికివచ్చును?

ఐరావతీనదీ మైదానములందు వరిపంట యెక్కువ. ఈపంటయంతయూ నదిగుండ రంగూను చేరి అచట బియ్యపు మిల్లులలో దంపబడి బియ్యమై ఇంగ్లాండునకే గాక జావా, చైనా, జపాన్, దేశములకు యెగుమతి యగును. మనదేశమున పంట పండక క్షామము వచ్చెనేని రంగూన్‌బియ్యము మనదేశమునకు యెగుమతి యగును. ఈబియ్యము ముదుగురకమువి.

కిరసనాయిల్: ఉత్పత్తి ఇచటఅధికమగుచున్నది ఇదిముఖ్యముగా చైనా కెక్కువ యెగుమతి యగుచున్నది. మనకుకూడ కొంచెము వచ్చు చున్నది. 1919 సం॥ యీబియ్యము దక్షిణ ఇండియాకు విశేషముగ ఎగుమతి యయినది.

జనులు. బర్మావారు చీనా జపానువారిని పోలియుందురు. వీరు పొట్టిగాను దిట్టముగాను ఉందురు. వీరిదేహము కొంచెము పసుపురంగు గలిగియుండును. వీరు ఆటలయందును సంగీతమునందును ఆస కలవారై ఖులాసాగా నుందురు

వీరికందరికిని వెంట్రుకలు పొడవుగానుండును. వీరందరు తలమీద ముడివేసి తలచుట్టును రంగులచేత డాబుగానుండు బట్టలను చుట్టుదురు. స్త్రీలు వెంట్రుకలను చుట్టలుచుట్టి పరిమళపుష్పములను ధరింతురు.

వీరియందు జాతిభేదములు లేవు. స్త్రీలకు ఘోషాలేదు. ప్రపంచములలో నుండు స్త్రీలకంటె వీరికెక్కువ స్వతంత్రము కలదు. బజారులో వ్యాపారము చేయువారు స్త్రీలే. వీరు సంపాదించిన డబ్బు వీరిదేగాని ఇతరులకు ఇయ్యనక్కరలేదు. చట్టప్రకారము మది యితరులకు చెందదు.

వీరు పిల్లలకు 12, 13 సంవత్సరము లయినతరువాత శుభదినమును యేర్పాటుచేసి బంధువులను స్నేహితులను పిలిచి బ్యాండువాయిద్యము జరుగుచుండగా చెవులు కుట్టుదురు. తరువాత రానురాను దీనిని పెద్దదిచేయుచుండుటచేత ఈరంధ్రమందు పొగచుట్టలుకూడ పట్టునట! ఈడువచ్చుచున్నదని చూపుటకిది వారియందుగుర్తు. మొగబిడ్డలకు మొలనుండి మోకాలువరకును పచ్చపొడిచెదురట, ఇది మిక్కిలి బాధకరమయినను ఈయాచారము పోలేదు.

బర్మాలో ఇండ్లనన్నిటిని యెత్తుగా కొయ్యలమీద కట్టుదురు. ఇందుకు కారణము నేల తేమగానుండుటయు, వెల్లువలు తరుచుగా వచ్చుచుండుటయు వీరు మేకులులేకుండ వెదురుతో ఇండ్లను కట్టుదుర్వు. ఇంటియందు ఫర్నిచరు యేమియు నుండదు. క్రిందికి జమ్ముచాపయు తలక్రిందికి వెదురుదుంగయు, చలికాలమునకు మూడునాలుగు కంబళ్ళుమాత్రమే వారి ఫర్నిచరు.

వీరు దినమునకు రెండుమారులు స్నానముచేసి దేహమును శుభ్రముగ నుంచుకొందురు. ఎందుకు? వీరిలో బ్రహ్మచారులు నడుమునకు పొడుగైన బట్టను కట్టుదురు. స్త్రీలకుకూడ ఇట్టివస్త్రమేకాని దానికిరంగులు డాబుగానుండును. స్త్రీలుకూడ చుట్టలుకాల్తురు. వీరు బౌద్ధమతస్థులు కాన జీవహింస చేయరు. ఇందుచేత వీరు మాంసము తినువారుకారని చెప్పనక్కరలేదు. బర్మాయందు బౌద్ధదేవాలయములు మతగురువులు యెక్కడచూచినను కనుపడుచుండును.

వీరు పాటుపడువారుకాక. సుఖజీవనమే కోరుచుండువారుగాన ఇచ్చటిపరిశ్రమలకు చైనా, ఇండియాదేశములనుండి పనివారలను రప్పింపవలసి యున్నది. అందుచేతకదా ఉత్తరసర్కారు జిల్లాలనుండి ‘ తూర్పువాండ్లు ’ ‘రంగూనునకు’ వెళ్లుచుండుట.

మెంత్తమునీద బర్మావారు వారి నైసర్గికస్థితులకు తగినట్టి నైజము గలవారుగ నున్నారు. ఏమన వారిదేశము మిక్కిలి సారవంతమైనదగుటచేత, ఇది అదియని వివక్షలేక సమస్తము పండుటవలన శ్రమలేకయే వారికి కావలసినదంతయు దొరకుచుండును. దీని క్లయిమేటు తడిగాను వేడిగాను ఉండుట చేత ఇది బడలిక యెక్కువ కలుగజేయుచున్నది. కాన వీరియందు యెక్కువ ఓపికగాని మనోనిశ్చయముగాని (Decision of character) ఉండుట అరుదు. దీనికితోడు దయాధర్మములను బోధించు బౌద్ధమతము వీరిని మరింత మెత్తదిగలవారినిగా చేయుచున్నది. ఇంతేగాక వీరి కితరదేశములతోడి సంపర్కము లేకుండుటచేత ఇతర ప్రపంచచర్యలు తెలియకయుండెడివారు. అయినట్టుకానీలే అనియూరకుండు బుద్ధిగలవారగుటచేతవీరికి తూర్పు ఐరిష్ వా రని పేరువచ్చినది. నిజముగా వీరు సోమరితనము మరిగి పనినంతయు స్త్రీలకు వదలివేసి స్వేచ్ఛగా తిరుగుచుందురట.

ఇచట రాకపోకలకు అనుకూలము లున్నవా ! రైలుదారి వేయవలసిన యెడల యేమార్గమున వేతురు ? రోడ్లు వేయుట సులభమా ? రాకపోకలకు కావలసిన సౌకర్యము లుండకుండుటచేతను ఇంకను కొంతభాగము దట్టమయి చొరనవశ్యమగు అరణ్యముగనుండుటచేతను, దేశసంపద జనుల స్వాధీనమునకు రాలేదు ఇట్లు వచ్చుటకు కొంతగాలము పట్టును.

పట్టణములు రంగూను. ఇది యెచ్చటనున్నది ? దీనికుండు లాభములెవ్వి ! ఇచటినుండి యేయేసరకులు యెగుమతియగుచున్నవి ! ఇచటికి కూలివాండ్రెందుకు వెళ్ళుదురు ? వీరేమిపనిచేయుదురు ? ఈపట్టణమునకును కలకత్తాకును ఉండు సౌకర్యముల భేదమేమి ?

ఇది బర్మాకు ముఖ్యపట్టణము. నౌకాబలమందు ప్రసిద్ధిజెందిన ఇంగ్లీషువారు సముద్రతీరమునకదా ముఖ్యపట్టణముచు యేర్పరిచిరి. ఇంగ్లీషువారు మరియొక పట్టణమును ముఖ్యపట్టముగా చేసినయెడల రంగూనుపట్టణమున కేమైన నష్టమా ! ఎందుకు !

ఇచట ష్వీడేగన్ పెగోడాయను గొప్ప బౌద్ధదేవాలయము కలదు. దీనిని చూచుటకై యెందరో యాత్రికులు వచ్చుచుందురు. ఈదేవాలయముమీద బంగారు కలశము లున్నవి.

మాండలె పురాతన ముఖ్యపట్టణము. ఇది మైదానమునందున్నది. ఇక్కడినుండి రైలుదారులు అన్నివైపులకును పోవుటకు వీలున్నది. ఎందుకు! కావున ఇకముందిది పెద్దరైలుబండి జంక్షన్ కాగలదు.

భామొ, అమరాపురము మొదలగునవి ఇతరపట్టణములు.

## సింహాళము

మనదేశమునకు దక్షిణముననుండు ద్వీపము. ఇందు పూర్వము రావణాసురుడను 10 తలలుగల రాక్షసుడుండెననియు ఈతడు సీతను దొంగిలించుకొని పోవుటచేత రాముడు లంకకు వానరులతో వెళ్ళి రావణుని సంహరించి సీతను తెచ్చెననియు రామాయణమునందు చెప్పబడి యున్నది.

పూర్వ మెటులయుండెనో మనకు తెలియదు. ఇందు రాక్షసు లుండినట్లు నిదర్శనములు కానబడవు. నైసర్గికస్థితినిబట్టి చూడ ఇది ఇండియాతో చేరినదేగాని రాజకీయ విషయములందిది వేరుగనున్నది.

దీనికిని మనదేశమునకును నడుమ సముద్రమున మునిగియుండు ఇసుక దిబ్బలు నావయాత్రకు ఆటంకము చేయుచున్నవి. అందుకొరకై పాంబన్ కాలువ త్రవ్వియున్నారు. 10 అడుగుల నీటి నీడ్చుకొని పోవు నావలు దీనిగుండ దాటవచ్చును. మన్నారు జల సంధిగుండ చిన్నపడవలు మాత్రము వెళ్ళజాలును, పెద్ద స్టీమరులు సింహళమును చుట్టుకొనిపోవలసినదే.

తీరరేఖ ఇది మిక్కిలి అందముగ నుండును. నీటివరకును కొంకాయచెట్లు వ్యాపించియుండుటచేత ఇవి గాలిలో కదలుచుండుట కంటికింపుగ నగుపడును. వీని నడుమ అచ్చటచ్చట చెస్తపల్లె లున్నవి. తీర

ము వెంబడి రోడ్డునకు రెండువైపులందును పోకచెట్లుదిగి యుండ వానికి అల్లుకొని పూలచేతను పండ్లచేతను నిండియుండు మిరియపు తీగెలు కాన్పించును

ఈమిరియపు తీగలచే నలంకరింపపడి గాలికి ముందువెనుకకు అల్లల నాడుచుండు కొబ్బరి పోకచెట్లక్రింద పోవుచు ఒకప్రక్క దాల్చిని చెట్ల పరిమళమున కానందించుచు, మరియొకవైపున నీలపు సముద్రమునుండి వచ్చు చల్లని పవనమునకు సంతసించుచు పోవు బాటసారికి లంకయనిన నందనవనమని తోచుట యాశ్చర్యమా!

బాటసారులు యాత్రీకులు లంకయొక్క సౌందర్యమునకు అద్భుత పడి దీనిని 'తూర్పుసముద్రపుముత్యే' మనియు, ఇండియాయొక్క 'ఉద్యానవన' మనియు అనుచున్నారు.

పడమటి తీరమునకంటె తూర్పు తీరమునందు వృక్షసంపద యొక్క తగుటచేత ఇచటనుండు ట్రికోణమల (Trincomale) హార్బరు అత్యంత సుందరమైనది, పడమటి తీరమున కొలంబో, గాల్ హార్బరు లున్నవి.

ఈద్వీపము భూమధ్య రేఖకు ఎంతదూరమున నున్నది? ఈనదీ చాలకాలమునుండి సముద్రపు నీటిపైకి లేచుచున్నట్లు కనపడుచున్నది. ఇందుచేత ఇది అంతకంతకు పెద్ద దగుచున్నది.

పటమునుచూడుడు నదులెటుల ప్రవహించుచున్నవి? ఇందుచేతయొత్తు అయిన భూమి యొచట నున్నది! ఈపర్వతములందు పీడ్రొటలగల 8,300 అడుగుల యొత్తున్నది. కాని ఆదాముశిఖరము (Adam's peak) మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. ఎందుకన దీనిపైన ఒక చిన్న పల్ల మున్నది దీనిని బౌద్ధునియొక్క కాలిగుర్తు అనియు, శైవులు శివునిదనియు, మహమ్మదీయులు ఆదాము స్వర్గమునుండి దిగునపు డేర్పడిన కాలిగుర్తనియు, అనుకొనుటచేత మూడుమతముల వారికిని ఇది ముఖ్యయాత్రా స్థలమయినది.

ఈద్వీపమునందు రెండు ఋతుపవనములవలనను వర్షము బాగుగ

కురియును. అందు నైర్ౠతిఋతుపవనమునందు ఆవిరి యొక్కువగ నుండుటచేత ఎక్కువవర్షము (150 అం) నైౠతిభాగమందు కురియును. మిక్కిలి తక్కువగ నుండుచోట 50 అంగుళములయినను కురియును, సాధారణ వర్షము 100 అంగుళములు.

ఈవర్షమంతయు ఏమగును? నదులెన్ని యున్నవి? ఇందు పెద్దది మహానదిగంగ? ఇది పాడవుగానుండుటకు కారణమేద్ది? ఈనదులు నావయాత్రకు పనికిరాకపోయినను చూచుటకు మిక్కిలి యందము నిచ్చును. ఇవి చిన్నచిన్న సెలయేఱులుగా బయలుదేరి రాతిమీదినుండి రాతిమీదికి దుముకుచు పొదలలో మరుగుపడుచు, జరులవెంబడి పాఱుచు, దట్టమగు అరణ్యములలో దూరుచు అచ్చటచ్చటసొంపుగ వంగియుండు వెదురుపొదల క్రిందను వానిచుట్టునను వంకరటింకరగా ప్రవహించుచు తుదకు చదునగు తీరపులోయలయందు నెమ్మదిగ ప్రవహించి సముద్రము చేరుచున్నవి.

ఇచ్చటి వృక్షములలో కొబ్బరిచెట్లు, తాటిచెట్లు, జనులకు ముఖ్యమయినవి. దక్షిణభాగమునందు సుమారు 150 మైళ్ళవరకు కొబ్బరిచెట్లు దట్టముగ వ్యాపించియున్నవి. దీనియుపయోగ మెంతని చెప్పవచ్చును? ఆకులు ఇంటికప్పులు, చాపలు, చీపుళ్ళు మొదలగువానికిని, ఈనెలు దళ్ళకును సుళ్ళుఊరగాయకును, రసము కల్లు బెల్లము పంచదారలకును, లేతకాయ దాహమునకును, పచ్చికొబ్బరి కూరలకును, నూనెవంటలకును, ఒంటికి రాచుకొనుటకును, కొబ్బరిపిప్పి పశువులకును, చిప్పలు గరిటెలు, పండ్లపొడి మొదలైన వానికిని. నార పగ్గములకును, వలలకును, చాపలకును, పెండ్డులు దూలములకును దంతెలకును పనికివచ్చును.

ఉత్తరభాగమునందు తాటిచెట్లె మెండు. ఇవియు యింత ఉపయోగమైనవే. జనుల ఆవశ్యకములలో పాతికపాలీ చెట్లిచ్చుచున్నవి.

దాల్చిన పొదలు తరువాతవి. వీనినుండి దాల్చిని చమురు తీయుదురు. దేవీనిబెరదాల్చినిచెక్క లేక లవంగపుచెక్క. లవంగములకును 'లవంగపుచెక్కకును' సంబంధములేదు.

కొంతకాల మీదీవియందు కాఫీ పండుచుండెడిది. కాని కాఫీచెట్లకు రోగమువచ్చి ఆపంట నశించినది. తరువాత తేయాకుచెట్లు, రబ్బరుచెట్లు, చింకోనాచెట్లు వేసి పెంచుచున్నారు. ఈతేయాకు యెగుమతి యెక్కువగు చున్నది. రబ్బరు ఇకముందు యెక్కువ యెగుమతి కాగలదు.



జంతువులన్నిటిలో యేనుగు ముఖ్యము. ఇది అరణ్యములందుండు టచేత దీనిని పలువిధములుగా పట్టి మచ్చిక చేయుచుందురు. కాళ్ళకు పెద్ద పగ్గములతో ఉరులువేసి మచ్చిక యేనుగులసాయమున పట్టుట యొకపద్ధతి.

ఏనుగులు తిరుగుదారియందు గోతులు త్రవ్వి వానిమీద సన్నని కఱ్ఱలు పరచి వానిమీద మన్ను పలుచగా వేసి ధాన్యమును చల్లుటచేత అది పైరయి పచ్చగా నుండును. దీనిని తినుటకు వచ్చిన యేనుగులు గోతిలో బడినపుడు వానిని మచ్చిక చేయుదురు. ఈపద్ధతి ఏనుగులకు ఎక్కువ హానికరము.

పంటలు: వరి మొదలగు ధాన్యములు ఎకరములు 8,82,748, కాఫి 11,769, కోకో 36,324, తేయాకు 5,35,691; సింకోనా 293; కొబ్బరిచెట్లు 10,35,863; లవంగపుచెట్లు 47,908; రబ్బరుచెట్లు 1,54,460.

ఎగుమతులు. కోకో (1,60,282) హానులు, దాల్చినిచెక్క (1,86,220) టెంకాయనార (1,97,458) కొబ్బెర (8,46,515) కొబ్బెర నూనె (1,155,083) తేయాకు (52,80,033) గ్రాఫైటు (5,29,653) కొబ్బెరకాయలు (4,58,312) పోకలు (1,70,837, రబ్బరు (15.41,850,

దిగుమతులు. ప్రత్తిమ్యానుఫ్యాక్చరులు, బియ్యము, నేలబొగ్గు, సారాయములు మొదలయినవి.

పట్టణములు. కొలంబో దీనికి ముఖ్యపట్టణము. దీనికి మంచి హార్బరున్నది.మన్నారుజలసంధి తగిన లోతుగానుండక పోవుటచేత వాడలన్నియు ఇచట చేరును కాబట్టి ఈహార్బరు మిక్కిలి యుపయోగమయినది.

కొలంబో పట్టణము చుట్టునను చూచుటకు అందముగ నుండును.ఎచట చూచినను పొదరిండ్లు, ఏవైపునకు వెళ్ళినను తామరపుష్పములు గల కొలనులు, ఏవంక తిరిగినను తళతళ మెరయుచుండు ప్రవాహములు. తాళ, పోక కొబ్బరివృక్షముల నీడలలో హాయిగా మైళ్ళకొలది తిరుగవచ్చును.

క్యాండి (Kandy) పట్టణము పురాతనరాజధాని. ఇది కొండల నడుమ నున్నది. ఈకొండలయందు చెట్లుచేమలు దట్టముగ నుండుటచే వీని నడుమనుండు పట్టణమునకివి శోభను గలుగజేయుచున్నవి. దీనినడుమ గొప్ప చెరువుండుటచేత పట్టణము చూచువారల కింపుగా నుండుటయేగాక కొంతచల్లదనమునిచ్చుచున్నది ఇచట బౌద్ధదేవాలయము లనేకములున్నవి అందొక

దానియందు బుద్ధునియొక్క పంటిని మహాపవిత్రతో పూజించుచుందురు. ఇచటనుండు బొటానికల్ గార్డన్ (Botanical Garden) (ఓషధవనము) ప్రపంచమున ప్రసిద్ధిచెందినవానిలో నొకటి. న్యూవరయెల్లియ (Newvara Ellia) ఇచటి ఆరోగ్యస్థానము.

## పంటలు

మనదేశమునందిపుడు సాగుబడిలోనున్న భూమి ఎకరములు22,29,,11,930. ఇంకను ఎ 11,46,65,202 లు తగిన నీటివసతియుండినయెడల సాగునకు తగియుండును. సాగుచేయుటకు బొత్తుగా తగనిభూమి ఎ 15,76,25,844 లున్నది.

వరి. ఇది ఉష్ణమండలపుపంట. దీనికి యెక్కువవేడిమియు పొలముల నిండ నీరును ఉండవలయును. ఈరెండును లేనిచోట వరిపంట యుండదు) కావున నదీమైదానములందును, ముఖ్యముగా డెల్టాభూములందును విశేషముగా పండును. చెరువుల క్రిందకూడ నీటిసరఫరా యుండినయెడల ఈపంట పండును. ఇది జనులకు ముఖ్యమైన ఆహారము కావున సాధ్యమయినంతవరకు ఈపంటనె యెక్కువగా వేయుదురు. దీనినిబట్టి చూడ గంగ, మహానది, గోదావరి, కృష్ణ, కావేరి, ఐరావతీ నదుల డెల్టాలయందు దీపంట ముఖ్యమని వేరుగా చెప్పబనిలేదు. ఇందుచేత ఈప్రాంత్యములందు రాకపోకలకు వీలుండుచోట బియ్యపు యంత్రములు ప్రబలియుండును. ఈబియ్యములో చాలభాగము మనదేశమునందే ఖర్చగును. రంగూనులో తయారగు ముడుగుబియ్యము మాత్రము ఇంగ్లండు, జర్మనీ దేశములకు యెగుమతి యగుచున్నది. దీనినుండి వారు బీరు అను ఒకవిధమగు సారాయిని తీయుదురట!

గోధుమ. దీని తరువాత వచ్చు భోజన ద్రవ్యము గోధుమ. ఇదియు వరివలె గడ్డిదినుసుపంటయే కాని ఇది యెక్కువ వేడిమినిగాని నీటినిగాని తాళజాలదు. పంటవేయునపుడు కొంచెము తడిగాను చలిగాను

# జాబితా. C

1910-1911-వ సంవత్సరము ఏయేభాగములందు ఏయేపంటలక్రింద ఎన్ని యెకరములు సాగైనదో ఈక్రిందిపట్టీ తెలుపుచున్నది.

| ప్రదేశము | వరి | గోధుమ | కాయధాన్యములు | చెఱకు | తేయాకు | ప్రత్తి | నూనె విత్తులు | నీలి | పొగాకు | అడవులు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అప్పరుబర్మా | 2150189 | 38519 | | 2357 | 1693 | 186266 | 1207566 | 264 | 36358 | 11591227 |
| లోయరుబర్మా | 7930014 | | | 9887 | | 15308 | 69009 | 7 | 45730 | 6783394 |
| అస్సాము | 4482607 | 118 | | 36500 | 348019 | 17304 | 355715 | 20 | 6779 | 2275193 |
| తూర్పుబెంగాల్ | 12833205 | 72154 | | 135202 | 69785 | 30684 | 1609024 | | 296724 | 1365422 |
| బెంగాల్ | 26134000 | 1419000 | | 343000 | 53400 | 68400 | 1970100 | 107000 | 143700 | 6053000 |
| ఆగ్రా | 4130758 | 4828914 | | 905867 | 8266 | 1179926 | 827335 | 36147 | 70128 | 8827004 |
| అయోధ్య | 2000760 | 1749227 | | 131749 | | 43970 | 201798 | 5746 | 15722 | 613184 |
| అజిమీరుమార్వార | 1266 | 43934 | | 938 | | 41140 | 47013 | 62 | 89 | 90720 |
| మాణ్‌పూరుపరగణా | 85 | 1386 | | 31 | | 165 | 879 | | | 15723 |
| పంజాబు | 799094 | 8675953 | | 417025 | 9027 | 1277025 | 1577508 | 46466 | 56637 | 3404836 |
| వాయువ్య ఫ్రాంటియరు | 40774 | 1028161 | | 32595 | | 32595 | 106723 | 11 | 7316 | 376169 |
| సింధుదేశము | 1096568 | 446700 | | 401 | | 210998 | 291221 | 5079 | 10536 | 78835 |

| ప్రదేశము | వ | గోధుమ | | చెఱుకు | తేయాకు | ప్రత్తి | నూనె విత్తులు | నీలి | పొగాకు | అషవులు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| బొంబాయి | 1884054 | 1382849 | | 58947 | 14 | 3872117 | 1444037 | 132 | 91037 | 8529668 |
| మధ్యపరగణాలు | 4774053 | 2744198 | | 18175 | | 1138031 | 2169580 | 14 | 16328 | 15087115 |
| బీరారు | 63749 | 319956 | | 2823 | | 3029459 | 229398 | 28 | 15286 | 2251164 |
| మదరాసు | 10359209 | 1:740 | | 87568 | 14625 | 2028538 | 2528837 | 94750 | 200931 | 12909403 |
| కొడగు | 81792 | | | 7 | | 42 | 275 | | 58 | 357843 |
| | 78731187 | 22769918 | | 2184801 | 525729 | 13172188 | 14625048 | 295706 | 81013352 | 81189511 |

ఉండి పంటయెదిగి గింజపట్టు సమయమునందు వేడిమి అధికమగుచుండిన యెడల ధాన్యము మిక్కిలి నాణ్యముగా బయలుదేరును. కాబట్టి డెల్టాల యందు పండెదుకదా, మిగత భాగములందైనను వేసవికాలమున యెండకు మాడిపోవునుగాని పండదు. ఇందుచేత దీనికి తిన్నని వాలుండి నీరు అధి

43-వ పటము




ఇండియా పంటలు

కముకాని ప్రదేశములందు చలికాలమున వేయుదురు. కాబట్టి పంజాబు లందును, సంయుక్తపరగణాల పడమటిభాగము నందును, మధ్యపరగణా లయందును చలికాలమున పంటవేసి మార్చి యేప్రెల్ నెలలందు కోయు

దురు. కాని పంజాబునందే యీపంట యెక్కువ. ఇది ఉత్తరభాగమునందు ముఖ్యమైన ఆహారము. ఇక్కడినుండి కర్రాచీ మీదుగా ఇంగ్లాండున కెగుమతి యగుచున్నది.

చెఱకు:—వరిపండుచోట చెఱకు పండగలదు కాని వరి చెఱుకున కంటె ముఖ్యమయినదగుటచేత వరికి నీరు తక్కువగు ఉష్ణప్రదేశములందు మాత్రమే చెరకుపంట పెట్టుదురు. ఇది పండుటకు దాదాపుగా ఒకసంవత్సరము పట్టును. అడవిపందులు, నక్కలు, కోతులు మొదలగు జంతువులు రాత్రులందు పాడుచేయును. పైగా దీనికి రోగముతగిలెనేని బహుత్వరిగా అల్లుకొని చెఱకు పంటనంతను పాడుచేయును. దీనికితోడు చెఱకు పండినతరువాత సరియైన గానుగల నుపయోగించినగాని రసమంతయు పూర్తిగా రాదు. వచ్చినరసమును చక్కెరచేయుటకు తగిన అనుభవము గలవారుండవలయును. లేనియెడల పాగుచెడిపోయి మంచిబెల్లముగాని చక్కెరగాని తయారుకాదు. ఈచిక్కులకు భయపడి మనవ్యవసాయదారులు చెఱకుపంట అంతగా పెట్టుటలేదు. పెట్టినను వారికి లాభము వచ్చుటలేదు. ఎందుకనగా విదేశములనుండి ముఖ్యముగా జర్మని బెల్జియము రష్యాలనుండి బీటుదుంప పంచదార లేక బీటుపంచదార యెగుమతియయి స్వదేశపు పంచదారకంటె చౌకగా అమ్మకమగుచున్నది. ఇందుచేత చెఱకుపంట తగ్గుటకు కారణమగుచున్నది. కాబట్టి ప్రకృతి శాస్త్రజ్ఞానము సంపాదించుకొనిన పంచదార నైపుణ్యులు (Sugar experts) బయలుదేరినకాని ఈపరిశ్రమ బాగుపడదు. ఇందున కిదియే తరుణము.

తేయాకు. ఇది చిన్న పొదచెట్టుయొక్క ఆకు. ఇది చైనాదేశమందు పంట పెట్టకయే యెదుగును. దీని ఆకులుగిల్లి వానినుండి రసముపిండి యెండవేసి డబ్బిలకెత్తుదురు. లేత ఆకులవలన ఏర్పడిన తేయాకు మిక్కిలి శ్రేష్ఠమయిన కషాయమునిచ్చును.

(1) దీనికి పైరుపచ్చల యెరువుండవలయును. అనగా ఎచట చెట్లయాకులు రాలి కుళ్ళిపోవునో అచటినేల ఈపొదలకు తగినది. (2) దీని

వ్రేళ్ళవద్ద నీరు విస్తారము చేరకూడదుకాని పదేపదే వాన కురియుచుండె నేని ఇదిత్వరత్వరగా చిగిరించుచుండును. కాబట్టి వర్షము రెల్లప్పుడు కురియు కొండప్రదేశము దీనికిమంచిది. అందుచేత అస్సాము దేశమునందును కాంగ్రాలోను తేయాకు పంట విశేషము. సింహాళము నందుకూడ తేయాకు తోటలున్నవి. దీని ఆకులే ముఖ్యముగనుక దీనికి నేల అంతసార వంతముగా నుండనక్కరలేదు. ఇది చలికి తాళగలదు. వేడిమి పనికిరాదు కాన కొండలమీదపండును.

కాఫి. కాఫిగింజలను చూడని వారుండరుకాబోలును. ఇది మొదట అరేబియా దేశమునుండి వచ్చినదట. ఇది గుబురుగా పెరుగుచెట్టు. దీనిని కత్తిరించనియెడల ఇం20 అడుగులయినను పెరుగును, కాని ఇంతపొడుగు పెరుగనిచ్చినయెడల చెట్టుయొక్క బలమంతయు కొమ్మలను పెరుగచేయుట యందుపోవును గనుక 5, 6 అడుగులకంటె యెక్కువగాదీనిని పెరుగనియ్యరు. ఈచెట్లపండ్లలోని విత్తనములే కాఫిగింజలు.

ఈచెట్లకు కుళ్ళిన ఆకలము మంచియెరువగును. దీనికిని వర్షము కురియు చుండవలసినదేకాని నీరు వేళ్ళవద్ద నిలువకూడదు. కాని తేయాకు చెట్టువలె ఇది చలికి కాళదు. కాన వెచ్చని ప్రదేశమే దీనికి మంచిది. విస్తారము గాలిని కూడ ఓర్వజాలదు. ఇందుచేత పడమటికొండల తూర్పువాళ్లయందే పంట వేయుచున్నారు కాని పడమటి భాగములందు వేయరు. తేయాకు చెట్టుకంటె దీనికి యెక్కువ సత్తువ కావలయును గనుక ఇది తేయాకు పండు చోట బాగుగాపండదు. కాననే సింహాళమందు తేయాకుపంట ప్రబలినది. బ్రెజిల్ దేశమునుండి కాఫీ ఎగుమతి విస్తారమగుటచేత నుదేశమందలి కాఫీతోటలు నశ్నగించినవి.

ప్రత్తి: ఇవి చెట్టునుండివచ్చు పదార్థముకదా. ఈచెట్టు ఉష్ణమండ లములలో ఫలించునుగాని విశేషము యెండ అక్కరలేదు. కాన ఉష్ణమండ లమునకును వెచ్చని మండలమునకును నడుమనుండు ప్రదేశమున పండును. ఉష్ణ

మండలమందైనను కొంచెము ఉన్నతప్రదేశములందు వృద్ధియగును.

ప్రత్తి చాలరకములు ఇందు జడప్రత్తి, పయిడిప్రత్తి యని సాధారణముగ వాడుదురు. పయిడి ప్రత్తియొక్క గింజలు పసిమివర్ణముగ నుండును. ఇది గింజకు గట్టిగ కరుచుకొని యుండును. దీనినుండి దారము సన్నగ రాదు కాన ఇది ముతకబట్టల కుపయోగపడును. జడప్రత్తినుండి దారము సన్నగను పొడుగుగను వచ్చును అందుచేత ఈప్రత్తి నయపుబట్టలనేత కుపయోగపడును.

దీనికి నేలయందు సున్నముండవలయును. ఇట్లుండినయెడల పంట బాగుగ పండును. మనదేశమునందు బేరారు, దత్తమండలము, మధ్య పరగణాల యందుండు నల్లరేగడి భూమిలో ఇదిపండును. దీనికి కావలసి నీరు ఈబంకమంటిలో నింకియుండి యెండవేడిమిగా నుండినను ఆవిరియై పోకయుండును. ఈ నేల పూర్వము మనదేశమున అగ్నిపర్వతములుండినపుడు ఏర్పడినది. ఇచట బసాల్టుశిలలు శిధిలమయి, మన్నగుటచేత ఇందు సత్తున మెండుగనిండియున్నది. కావుననే ఇది అనేక సంవత్సరములనుండి యేటేటను తప్పక ఫలము నిచ్చుచున్నది.

పంజాబులోను, సంయుక్తపరగణాలయందును గుజరాతులోను ఈపంటకు నీటి అధారము కావలయును. ఇచ్చటమంచిప్రత్తిపండును.

మనదేశమునందు ఈపంటకుతగిన సరియైన విత్తనము నేరికొనుటలేదు. కాన ప్రత్తి అంతకంతకు తగ్గురకముగుచున్నది. పూర్వము డక్కామజ్లిన్లకు వాడుచుండిన ప్రత్తి యిపుడు యెక్కడను కానరాదు. కాబట్టి దీనివిషయమై జనులు గమనింతురుగాక.

జనుము గోగుచెట్టురకములోనిది. దీనినుండి నారతీసి ఆ నారచేత గోతములు నేసి సంచులు (బస్తాలు) గా కుట్టుదురు. ఎగుమతి దిగుమతులు యెక్కువగుటచేత ఈసంచులకు గిరాకి యెక్కువయినది ఈపంటకు భూసారము విస్తారముండవలయును. కాబట్టియే యేటేటను ఒండుమన్ను చేరుచుండు డెల్టాలయందే యెక్కువ పండును. ఇప్పుడు గంగడెల్టాభూములందే ఇది తయా

రగుచున్నది. సమీపమున నేలబొగ్గు దొరకుటచేత సంచుల యెగుమతి యెక్కువగ నున్నది.

నల్లమందు: గసగసాలకాయలనుండి వచ్చుపాలు. ఈకాయలపై గీచినయెడల వరంగికాయ (బొప్పాయకాయ) మీద గీచినపుడెట్లు పాలు కారునో ఆవిధముగా పాలుకారి గట్టిపడును. ఈగట్టిపడినదానిని గోకి నల్లమందు క్రింద తయారుచేయుదురు. ఇది మత్తుమందు. ఇది విషపదార్థము. దీని కలవాటుపడినవారలు దీనిని విడిచియుండలేరు. ఇప్పుడిది పాట్నా ప్రాంతములందు దొరతనమువారి యధీనముక్రింద పంట వేయబడి చైనాదేశమున కెగుమతి యగుచున్నది. దీనినుండి నల్లమందు ధృతి యను ఆరకును తీయుదురు.

పట్టు: ఇది పురుగులనుండి వచ్చు సారపదార్థము. ఇవి మల్బరీ చెట్టు ఆకులమీద జీవించును. దీనినే పిప్పలి నేరడి చెట్టని యందురు. ఎందుకనగా ఇది పిప్పళ్లవలె నుండు పండ్లనిచ్చును. ఆముదముచెట్లుకూడ దీని కుపయోగించునట. ఈ చెట్లు బంగాళాదేశములో యెక్కువగానున్నవి.

ఒక్కొక్కపురుగు సుమారు 506 గ్రుడ్లు పెట్టి చనిపోవును. ఈగ్రుడ్లనుండిపుట్టిన పురుగులు మిక్కిలి చిన్నవిగానుండునె కాని వీనికి ఆకలి విస్తారముగుటచేత వీనికి వేసిన మల్బరి యాకులను ఒక్కనిముషములోతినివేసి పెద్దవగుచు తొడుగులను విడుచుచుండును. నెలరోజులకు రెండంగుళముల పొడుగయి చిటికెనవ్రేలి లావు అగును. అప్పుడు ఇది మత్తెక్కి పట్టుదారమును వడక నారంభించి కొన్నిరోజులకు తమచుట్టును పట్టుకాయను అల్లును. తరువాత దీనికి రెక్కలువచ్చి సుందరమైనరెక్కలపురుగై పట్టుకాయను పగుల దీసికొని వెలుపలకు వచ్చును అప్పుడీకాయ దారము తీయుటకు పనికిరాదు. కాన పురుగు బయటికి పోకమును పే ఈపట్టుకాయలను వేడినీటవేసి పురుగులను చంపి మిక్కిలి జాగ్రత్తగా దారపుకొనను కనిపెట్టి దారము విప్పివేయుదురు. దీనికి రంగులువేసి పట్టువస్త్రములు నేయుదురు.

ఇదికాక తస్సరకముపట్టు తూర్పుబంగాళా అస్సాముదేశపు కొండలనుండి యెగుమతియగుచున్నది. దీనికి టూసాపట్టు అని పేరు. తూర్పుబంగాళాదేశమందు దీనినే బట్టలకు వాడుదురట.

సింకోనా: ఇది మొదట పెరుదేశమునుండి దిగుమతి యయిన చెట్టు. దీని బెరడునుండి క్వైనాపొడిని తీయుదురు. ఇదియే జ్వరములకు సిద్ధౌషధము ఇది డార్జిలింగు పర్వతములమీదను నీలగిరికొండల మీదను ఉత్పత్తియగుచున్నది. ఇది చల్లని క్లయిమేటులో బాగుగా పెరుగును. ఉష్ణోగ్రతయందు రాత్రింబవలులకును వేసవి చలికాలములకును విశేష భేదముండక సమత్వముగా నుండుటదీనికి మంచిది. క్రొత్తగా కొట్టి వేసి సాగుచేయబడిన అరణ్యములందును నీరు ఝల్లున పారుటకు తగిన వాలుండు ప్రదేశములందును 50 అంగుళములు మొదలు 100 అంగుళముల వరకు వర్షముగలచోట్ల నిది వృద్ధియగుచున్నది.

సింకోనా రెండురకములు. ఎఱ్ఱది, పసుపుది. ఎఱ్ఱదానినుండి క్వైనా అంతగారాదు. పసుపుదానిలో క్వైనా అధికముగా నుండును.

అరణ్యములు: వర్ష మెచ్చట యెక్కువగానుండి కొండల మయమయి తగినంత వేడిమిగలిగి వృక్షములు దట్టముగా పెరుగునో ఆప్రదేశములు అరణ్యములగుచున్నవి. కాన పడమటి కనుమలందును, అస్సాము బర్మా కొండలమీదను, హిమాలయపు అడుగుభాగమునను మహారణ్యము లున్నవి

ఈ యరణ్యములు వర్షపాతమును బట్టియు వేడిమిని బట్టియు జౌన్నత్యమునుబట్టియు రకములుగా నుండును. వీని యందన్నిటిలో మిక్కిలి యుపయుక్తముగనుండునవియు విరివిగలవియు ఆకులు రాలిపోవు అరణ్యములు. అనగా ఇందలి చెట్లకు సంవత్సరమునకు ఒకమారు ఆకురాలి పోయి మరల చిగురు పెట్టుచుండును. ఇవి హిమాలయపర్వతము మొదలు అంతటను, బర్మాలోను ఉన్నవి. ఇందు పెరుగుకలప మిక్కిలి యుపయుక్తమయినది. టేకు, సాల్, నూకమాను (Fern wood) తుమికి చెట్టు (ebony) గంధపు చెట్లు మొదలగునవి అపరిమితముగా వృద్ధియగును. టేకుచెట్టునకు చెదపట్టదు గనుక ఇది కట్టడములకు మిక్కిలి ఉపయోగించుచున్నది.

వీనికి తరువాతవి నిరంతరము పచ్చగనుండు అరణ్యములు. ఇవి పడమటి కనుమలమీదను బర్మాలోను ఉన్నవి. ఇట్లనుటచేత ఇందు టేకు మొదలగు ఆకురాలు చెట్లు లేవని చెప్పుటకు వీలులేదు.

పంజాబునందును దక్షిణ ఇండియా యందును పొడి అరణ్యము లున్నవి. ఇవిగాక ఉన్నతారణ్యములు కొన్ని యున్నవి. అనగా ఇవి కొండలమీద యెత్తునుండునవి. పర్వతములమీద పోనుపోను చలి అధిక మగును. కనుక వృక్షములుకూడ మారుచుండును. 3,000 అడుగులకు పైన 12,000 అడుగులవరకు వరుసగా జూనిపర్, బర్చి, స్ప్రూసు, ఫర్, సీడర్; సైప్రసు, ఓక్, రోడోడెండ్రన్ వృక్షములు ఉండును.

సముద్రతీరమున ముఖ్యముగా డెల్టాలుండుచోట సముద్రపు నీరు పొంగుచుండును గనుక ఇట్టిచోట టైడల్ అరణ్యము లున్నవి (Tidal Forests) (జ్వారభాటారణ్యములు.)

గంగానదీ ముఖద్వారమునందు సుందరీవృక్షము లిట్టివి. ఇవి వంటచెరుకున కుపయోగపడును ఇవి మదరాసునకు ఉత్తరమున నుండు తీరపు జిల్లాలయందుకూడ నున్నవి. వెదురు గంతటను వృద్ధి పొందుచున్నది. తాటిచెట్లు పోకచెట్లు కొబ్బరిచెట్లను గురించి వేరుగ వ్రాయనక్కరలేదు.

(1) అరణ్యముల ఉపయోగములు: అరణ్యము లుండు చోట చల్లగ నుండును ఎట్లనగా వీని యాకులలో నుండు నీరు ఆవిరిరూప మున బయలుదేరి వాయువునందు చేరుచుండుటచేత గాలికి యెక్కువ వేడిమి యెక్కదు, ఇందుచేత ఉత్తరహిందూస్థానమందు వసంతఋతువునందు చెట్లు చిగిరించి కోమలముగా ఎదుగునపుడు వనములందు మిక్కిలి చల్లగ నుండును.

(2) ఇట్టి అరణ్యములుండుచోట పైభాగమున నుండు వాయువు చల్లగ నుండును. కాన ఆవిరితో నిండియుండు పవనములు కొండలను దాటునపు డెట్టుల చల్లబడి వర్షము నిచ్చునో ఆదే ప్రకారము అరణ్యముల మీద వీచు తడిపవనములుకూడ వర్షము నిచ్చును. ఇందుచేత అరణ్యము లుండుచోట వర్షములు బాగుగా కురియునని స్పష్టమగుచున్నది. వర్షము కురియుచోట అరణ్యము లుండుటకు వీలుండునని వేరుగా చెప్పనక్కరలేదు.

(3) అరణ్యములుండుచోట వర్ష మెక్కువగా కురియుటయేగాక అట్లు కురిసినవర్షము చాలవరకు వృధాపోకుండునట్లు అరణ్యములు సాయ పడును. ఎట్లనగా అరణ్యములుండుచోట ఆకులు రాలును. క్రిందపొదల

మొదలగునవి యుండును. వీనికి తోడుగా వృక్షముల్ వేళ్లు యీచెత్తను పోనీయకపట్టుకొనును. ఇట్టిచోట వర్షము కురిసినపుడు నీరుర్ఘుల్లున కాలువల లోనికిని నదులలోనికిని పోక ఈతుక్కునందు యిరుకుకొని యుండును. ఇందుచేత నదులు వెల్లువలైపారి నాశనము కలుగజేయకుండుటయే గాక వీనినుండి నీటిసరఫరా క్రమముగా జరుగుచుండును. ఇంతేగాక నీరు భూమి లో ఇంకి ఊటలుగా బయలుదేరును. ఇతరదేశములందు అరణ్యముల ఉప యోగ మెట్లుండినను ధారాపాతముగ వర్షించు మనదేశమునందు అరణ్య ములు మిక్కిలి ఆవశ్యకములు. ఇవిలేని యెడల కురిసినవర్ష మంతయు వృథాగా సముద్రములోనికి ప్రవహించును. వెల్లువలవల్ల కొంత అపాయము కూడ కల్గును. ఇట్టిబాధలను తొలగించుటకై అరణ్యపోషణము చేయు చున్నారు. ఇట్లుచేయుటచేత వర్షము లెక్కువకురియుటయేగాక కురిసిన జలము దుబారాగా పోకుండును.

(4) అరణ్యమునుండి కలప, వెదురు, వంటచెరకు, బంక, లక్క, వార్నీసు మొదలగునవి వచ్చును. తోళ్లు పదును చేయు రంగుసామ్రగికూడ దొరకును.

రబ్బరు: ఇది చెట్టునుండి తీసిన పాలుగాని జంతుసంబంధ మయి నదికాదు. ఆచారవిషయమున ఇంగువ యెంత తగినదో రబ్బరుకూడ అంత తగి నదే. మోటారుబండ్లు బైసికిళ్లు మొదలగువానివలన రబ్బరునకు గిరాకీ యెక్కు వయినది. మనదేశమునందుండు అస్సాము అరణ్యములనుండియు సింహాళ ములో వేయబడిన తోటలనుండియు రబ్బరు యెగుమతి యెక్కువకాగలదు

కర్పూరము: కర్పూరపుచెట్ల కొమ్మలను భట్టిపెట్టి ఆవిరిరూప మున పోవు నూనెను చల్లబరుచుటచేత కర్పూరము గట్టిపడి తెల్లగా నగును. గాలిలో నుండినయెడల ఇది కొంచెముకొంచెముగా కరిగిపోవును. కాన దీనిని డబ్బీలలో నుంచవలయును. జపాన్‌వారు ఫార్మోజాదీవిలో నీపంట వేయు చున్నారు.

ఖనిజములు: ఇంతవరకును వ్యవసాయవిషయమున పని జరుగు చున్నది. కాని ఉపయోగకరమగు ఖనిజముల పరిశ్రమకై అంతగా శ్రమ పడుటలేదు. జరిగిన కొద్దిపరిశ్రమయు గనులనుండి ములభముగా ఎగుమతి యగుటకు తగినఖనిజముల విషయమునను, గనులనుండి తీసినది తీసినట్టుగా

మనదేశమున ఉపయోగమునకు వచ్చునట్టి ఖనిజముల విషయమునను జరుగుచున్నది.

పూర్వము అనగా ఐరోపావారు మనదేశమునకు రాకముందు రాగి ఇనుము, సీసము, ఉక్కు మొదలగు లోహములు స్వదేశ పద్ధతిప్రకారము తయారగుచుండినవి కాని, యూరోపియనులు వారి రసాయనశాస్త్రి జ్ఞానముతో, మనదేశమునకు వచ్చిన తరువాత వారియెదుట ఈపరిశ్రమలు నిలువజాలినవి కావు. ఈలోహములను తమదేశమునందు తయారుచేసి సులభముగా నావలోవేసి తెచ్చి ఇనుపదారులమూలముగా అన్నిభాగములకు ఎగుమతిచేసి చౌకగా అమ్ముటచేత ఈపోటీకి స్వదేశపరిశ్రమలు నిలిచినకావు. ఇట్లుండగా మనదేశమందు జనుము, ప్రత్తి, కాకితపుపరిశ్రమలకు యంత్రములు కావలసియుండుటచేత వీనియెగుమతి మరింత యెక్కువాయెను. ఈప్రకారము యేటేటను ఖనిజములయెగుమతి యూరోపునుండి యెక్కువగుచు వచ్చినది.

నేలబొగ్గు: ఇది మిక్కిలి ఉపయుక్తమగు పదార్థము. ఇది విశేషముగా దొరుకుచోట పరిశ్రమలు బాగుగా జరుగును. ఐరోపావారి యొక్క ఘనతకు నేలబొగ్గు ఒకముఖ్య కారణము, ఎట్లనగా నేలబొగ్గు కాల్చి దానినుండి వెలువడు 'శక్తి' వల్ల కేవలము కూలివారలను పెట్టక యంత్రసాయమున ఎంతపని నైనను చేయించగలరు. కూలివారల సాయమున జరుగు పరిశ్రమ ఇంతయని చెప్పవల్లకాదు.

ఈబొగ్గు యెట్లువచ్చినది? యుగములక్రిందట మన భూమిమీద జనసంఖ్య తక్కువగానుండినపుడు పెచ్చుపెరిగిన అరణ్యములనుండి వచ్చినది. ఈఅరణ్యములు వృద్ధియయి కొంతకాలమునకు చెట్లుపడిపోయినవి ఇట్లు పడిపోయిన తరువాత వీనిమీద మంటితెరయేర్పడి ఈతెర అంతకంతకు హెచ్చుకా జొచ్చినది. ఇందుచేత ఈకలపమీద బరువు యెక్కువాయెను. భూమిలోని వేడిమిచేత ఈకలపకాలి భగ్గనమండుటకు వీలులేక మాడిపోయి పైబరువుచేత నొక్కబడి యెక్కువ సాంద్రతను పొంది లోహమువలె 'ఖంగుఖంగు' మని శబ్దము నియ్యజొచ్చినది. ఇట్లేర్పడినదే నేలబొగ్గు. ఇది యుగములక్రిందట సూర్యుని వేడిమిచే వృద్ధిపొందిన అరణ్యములనుండి వచ్చిన బొగ్గుగాని ఇతరము కాదు. అనగా సూర్యుని తాపశక్తి ఇందు అంతర్గతమయియుండి కాల్చగానే వెలువడి మన కుపకరించుచున్నది.

| | వేలలో (టన్నులు) | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1899 | 1900 | 1901 | 1902 | 1903 | 1904 | 1905 | 1906 | 1907 |
| బంగాళా | | | | | | | | | |
| డాల్టన్‌గండి | | | 3 | 19 | 33 | | | | |
| గిరిధ | 8 | 712 | 694 | 776 | 766 | | | | |
| జరియా | 1007 | 1710 | 1946 | 2420 | 2493 | | | | |
| రాణిగంజి | 2396 | 2882 | 2841 | 3042 | 3066 | | | | |
| మధ్య ఇండియా | | | | | | | | | |
| ఉమేరియా | 164 | 164 | 164 | 171 | 193 | | | | |
| మధ్యపరగణాలు | | | | | | | | | |
| మోపని | 23 | 39 | 43 | 43 | 31 | | | | |
| వరోరా | 132 | 133 | 148 | 153 | 127 | | | | |
| హైదరాబాదు | | | | | | | | | |
| సింగరేణి | 401 | 469 | 421 | 455 | 362 | | | | |
| అస్సాము | | | | | | | | | |
| మాకం | 233 | 215 | 454 | 220 | 239 | | | | |
| బేలూచిస్థానము | | | | | | | | | |
| ఖోస్ట | 11 | 17 | 18 | 25 | 36 | | | | |
| సార్ రేంజి | .. | 5 | 6 | 7 | 10 | | | | |
| బర్మా | | | | | | | | | |
| ష్వెబో | 8 | 10 | 12 | 13 | 9 | | | | |
| కాశ్మీరము | | | | | | | | | |
| లద్దా | .. | ... | ... | 1 | 1 | | | | |
| పంజాబు | | | | | | | | | |
| దండోట్ | 81 | 74 | 67 | 55 | 43 | | | | |
| రాజ పుత్రస్థానము | | | | | | | | | |
| బికనీరు | ... | 9 | 12 | 16 | 21 | | | | |

ఈబొగ్గు మనదేశమునందు అచ్చటచ్చట నున్నది. సాధారణముగా రైలుకువాడుబొగ్గులో చాలభాగము మనదేశమునందు ఉత్పత్తిఅయినదే.

## ప్రశ్నలు.

1. టన్ను అనగా ఎంత? 2. పైజాబితాను బట్టి గనులెక్కడ నున్నవో పటమున గుర్తింపుము? 3. ఎక్కువ ఉత్పత్తియగునని మొదట వ్రాసి మిగతవానిని వరుసగా వ్రాయుము? 4. పైసంగతిని గ్రాపు (Graph) లో చూపుము? 5. ప్రతిసంవత్సరము యెన్నిటన్నుల బొగ్గు ఉత్పత్తిఅయినదో కనుగొనుము? 6. మనదేశమున ఏరాజకీయ భాగమునందు యెక్కువ బొగ్గు ఉత్పత్తి యగుచున్నది? 7. పరిశ్రమలకును బొగ్గునకును ఏమి సంబంధము? సవిస్తరముగా వ్రాయుము? 8 నేలబొగ్గు లేనిచోట పరిశ్రమలు జరుగునా? ఎట్టిసందర్భమున జరుగును. ఉదాహరణము చెప్పుము?

**పెట్రోలియము:** ఇదియు మన దేశమునందు ఉత్పత్తి యగుచున్నది. 1894 సంవత్సరము 115 లక్షల గాలనుల నూనె ఉత్పత్తి అయినది. 1908 వ సంవత్సరమునకు 880 లక్షల కెక్కినది. ఇంతైనను ప్రపంచమున ఉత్పత్తియగు నూనెయందు నూరింట ఒకపాలు మాత్రమె మన దేశమునుండి వచ్చుచున్నవి. 75 భాగములు రష్యానుండియు 19 భాగములు అమెరికాలోని యునైటెడు స్టేట్సునుండియు వచ్చుచున్నవి

పంజాబులోని రావల్ పిండి జిల్లాలో ఇది కొంత ఉత్పత్తి యగుచున్నది. తూర్పుననుండు అస్సాముదేశమున దాదాపుగా 25 లక్షల గాలనులనూనె వచ్చుచున్నది. కాని బర్మాలోనుండునవి మిక్కిలి ముఖ్యమయినవి (1) మాగ్విజిల్లాలోని యనాంగ్ యాంగువద్దను (2) మ్యింగ్యాన్ జిల్లాలోని సింగువద్దను, (3) హెంకాక్కు జిల్లాలోని యానాంగ్ యడ్ వద్దను (4) అక్యాబ్ (5) క్యూక్ప్యూవద్దను లక్షల కొలది గాలనుల నూనె తీయుచున్నారు. 1903-వ సంవత్సరమున 853 లక్షల గాలనుల నూనె తీసిరి.

ఇండియా బర్మాపటములు వేసి ఇందుమట్టినూనె దొరకు ప్రదేశములను గుర్తింపుము?

**బంగారు:** ఇది కనికరాళ్ళలో నుండునది. ఇది అన్నిరకపు కనికరాళ్ళలోను ఉండదు. బంగారుండు కనికరాళ్ళలో నిది చారలు చారగాలు నుండును. ఈరాతిని నలగగొట్టి బరువైన బంగారు రజమును పాదరసపు సహాయమున తీయుదురు. ఇది మైసూరులోని కోలారు నందు ఉత్పత్తి యగు

చున్నది. ఇచటి గనికాండ్లు అరితేరిన ఇటాలియావారు. ఈగనుల కొరకు ఇనుపదారులు వేసియున్నారు. పట్టణములు బయలుదేరినవి. దీనికిగాను ఇతర అఫీసులు యెన్నియో ఏర్పడినవి.

ఇనుము: ఇనుముండు గనులు సేలంజిల్లాలోను, బళ్లారిజిల్లాలోని సండూరు జమీందారిలోను, మధ్యపరగణాలలోను ఉన్నవి కాని దీనికి సమీపమున నేలబొగ్గు లేకపోవుటచేతను, పరిశుభ్రము చేయుటకు కావలసిన సున్నపురాళ్ళు ఉండకపోవుటచేతను ఇనుముయొక్క ఉత్పత్తి అంత అధికముగ లేదు. ఇవుడిపుడు రాణిగంజివద్దనుండు ఝారకపూరు వద్ద ఇనుము తయారగుచున్నది. ఇందుచేత మనదేశమున వాడుకలోనుండు ఇనుపసామగ్రి అంతయు ఇతరదేశములనుండి యెగుమతి అయినదే.

ఉప్పు: సాధారణముగా అందరకును ఆహారములో ముఖ్యమైన పదార్థము ఉప్పు. ఇది మూడువిధముల తయారగుచున్నది. (1) సముద్ర తీరమునసుండువారు సముద్రపునీటిని కయ్యలలోనికి పారనిచ్చి ఆనీరు యెండకు ఆవిరియైపోగా ఏర్పడిన ఉప్పును చేతులతో జవిరివేయుదురు. ఉప్పు కయ్యలుండు స్థలమునుబట్టి ఉప్పుయొక్క రంగు తేలును. నెల్లూరుప్రాంత్యమున తయారగు ఉప్పు తెల్లగానుండును. కాకినాడవద్ద తయారగునది నల్లగనుండును. సాంబార్ చెరువునుండి 1,35,000 టన్నుల ఉప్పు తీయుచున్నారు.

(2) గనులనుండి తీయు ఉప్పు మరియొకటి. దీనిని రాతి ఉప్పు అందురు. ఉత్తరఇండియాయందు చాలామట్టుకు ఈయుప్పునె వాడుదురు. పంజాబులోని సాల్టు రేంజి వద్ద అక్బరు కాలమునకు ముందునుండి ఉప్పు త్రవ్వి తీయుచున్నారు ఇప్పటికిని 550 అడుగుల దళసరిగల ఉప్పు తెట్టెయున్నది.

(3) ఇవికాక ఇంగ్లండునుండి వేలకొలది టన్నులు యెగుమతియగుచున్నది. మనదేశమునకు ముడిపదార్థమునకై వచ్చు నావలలో కొంత సరకుండినను భారము కొరకు కొంత ఉప్పును భర్తీచేసి పంపుదురు.

ఉప్పుపంట దొరతనమువారు స్వాధీనముందుంచుకొని యున్నారు దీనినుండి కొంత వరుమానము వచ్చుచున్నది.

## పరిశ్రమలు.

ఇంతవరకు దేశమునందుండు స్వాభావికభాగములను గురించి చెప్పితిమి. నదీ మైదానములందును డెల్టాభూములందును వరి జనుము పంటలును నీటిసప్లయి తక్కువయి చలికాలమునందు వేడిమితక్కువగనుండుచోట్ల గోధుమ పంటయు, నల్లరేగడి భూములయందు ప్రత్తియు, అరణ్యములందు టేకు మొదలగు కలపయు, వర్షము కురియు పర్వతపు వాళ్ళయందు తేయాకును, ముఖ్యముగా పండు పదార్థములు.

మనదేశమునందు నేలబొగ్గు అచ్చటచ్చట ఉత్పత్తి యగుచున్నది. సేలము జిల్లా మొదలగుచోట్ల ఇనుప ఓరు (Iron ore) దొరుకునుగాని ఈ రెండును ఒకచోట ఉండకుండుటచేత ఇనుప పరిశ్రమ వృద్ధియయినది కాదు, బంగారు కోలారునందు ఉత్పత్తియగుచున్నది. కాని ఇది విలువగల పదార్థమైనను అంత ఉపయోగకరము కాదు

దీనిని చూడగ మనదేశమునందు ఖనిజసంపద విశేషముగా పైకగుపడుట లేదు. భూగర్భశాస్త్రిజ్ఞానము గల భారతీయులు బయలుదేరి విదేశములకు వెళ్ళి వారి తెలివితేటలు ఉపయోగించినయెడల మనదేశమాత గర్భమందు యెట్టి మణులు యెట్టి అమూల్యములగు పదార్థములున్నవో తెలియగలదు.

ఇప్పటి స్థితినిబట్టి చూడగా మనదేశమునందు కొంతకాలమువరకు వ్యవసాయమే జనులకు ముఖ్యవృత్తిగా నుండవలసినటుల కనుపడుచున్నది. ఇంతైనను మనము జయప్రదముగా పనిచేయుటలేదు. ఏమనగా ఒక యెకరమునకు ఇతర దేశములందు పండుపంట మనదేశమునందు నాలుగుయెకరములకైనను పండుటలేదు. ఇందుచేత మనభూమి పనికిరానిదని యనుకొనకూడదు. నిశ్చయస్థితి చెప్పవలయునేని భూమియందించుకైనను లోపము కనబడదు. ఎన్నివేల సంవత్సరములనుండి మనభూమి పంటల నిచ్చుచున్నదో యెవరెరుగుదురు! ఇంతకాలము ఫలమునిచ్చి పోషించిన భూములందింతకాలము సారముండగలదా! భూమినుండి తీసివేసిన సారము మరల భూమికి యేదోరూపమున వచ్చినగాని సారము తగ్గకుండును. అది యెట్లు చేయవలయును! ఈ ప్రశ్నకు జవాబుయేమి? ప్రకృతిశాస్త్రిజ్ఞానము సంపాదించుకొని పని చేయుటయే ఒకరిద్దరు ఆ శాస్త్రిజ్ఞానమును సంపాదించిన చాలదు. నూతన

విషయములను కనిపెట్టువారు సాధారణముగ నొకరిద్దరే యుందురు కాని ప్రకృతిశాస్త్రానుగుణ్యముగా సేద్యము చేయువార నేకులుండవలయును. కావున మన వ్యవసాయదారులు విద్య నేర్చుకొని మంచిచెడుగుల నాలోచించి తగిన సలహా నియ్యగలవారిమాటయందు లక్ష్యముంచి, వ్యవసాయ పరిశ్రమ జరిపినయెడల మనదేశమునందు ఇపుడు సాగులో నున్న భూమియే మనలను ఎన్నిరెట్లయినను బాగుచేయగలదు.

ఇట్లనుటచేత పరిశ్రమలు మనకు తగవని కాదు. వీనినికూడ నేర్చుకొనవలసినదే. అభివృద్ధి చేయవలసినదే. వీనివల్ల దేశమునకు లాభము లేకపోలేదు. ఇపుడు మనము చమురువిత్తులను, చర్మములను యెంత యెగుమతి చేయుచున్నాము! వీనికి బదులు నూనె, సబ్బులు, బూట్లు, జీనులు తెప్పించుకొనుచున్నాము కదా. అటుగాక నూతన పద్ధతుల ప్రకారము నూనె విత్తులను గానుగాడించి నూనె తీసినయెడల అది సబ్బులకుకూడ పనికివచ్చును. పైగా గానుగపిండి మిగులును. ఇది పొలములకేమి పశువులకేమి ఉపయోగించును. మరియు కొందఱు పనివాండ్రకు పని కలుగును. ఈవిధముననే తోలు నెగుమతి చేయుటకు బదులు దానిని నూతనపద్ధతి ప్రకారము పదునుచేసి బూట్లు మొదలయిన వానినిక్కడనే తయారుచేసిన యెడల అవి మనకు చౌకగా గిట్టుటయేగాక యితరదేశములకుకూడ యెగుమతి చేయగలుగుదుము

ఈయుసర్గమునకంతకు కారణములు కొన్నియున్నవి' (1) మనకు ఉద్యమాసక్తి లేకయుండుట. (2) స్వయంసహాయ్యశక్తి చచ్చియుండుట. (3) సహకారభావ మంతరించియుండుట (4) ప్రకృతిశాస్త్రజ్ఞానము సున్నయగుట. ఈవిషయములు 'పరిశ్రామిక హిందూదేశము' నందు విపులముగ చర్చింపబడియున్నవి.

ఇపుడిపుడు పరిశ్రమకు ప్రయత్నములు జరుచున్నవి. ఇపుడిపుడు మనము కన్నులు విప్పుచున్నాము. ఆల్ ఫ్రెడ్ చాటర్టను (Mr. Alfred Chatterton) మొదలగు మహనీయుల నేర్పాటు చేసి దొరతనవారు దారి జూపుచున్నారు. టెంకాయచెట్టెక్కువానిని పైకి ఏంతదూరము యెత్తగలరు ! మనయందు మనకు నమ్మకము ప్రబలి ఉత్సాహము స్వయముగా

పుట్టుకొని వచ్చినగాని దొరతనమువారు చేయు ప్రయత్నములు అంతగా రాణింపవు. క్రొత్తగా నేర్పడిన కంపెనీలు యెట్లు పనిచేయునో చూడవలయును.

మనదేశము మొత్తముమీద వ్యవసాయమునకే తగియుండినను పరిశ్రమలు బొత్తుగా లేకపోలేదు. యంత్రపు సరకులు రాకముందు ఇనుము రాగి మొదలగు లోహములు తయారగుచుండెడివి ఢక్కా మజ్లిన్ బట్టలు మొదలుగా అన్నిరకముల నాణెంపు బట్టలు ముతక బట్టలు ఇక్కడనే తయారుచేయుచుండిరి. వారు. కాశ్మీర దేశమునందు శాలువలు నేయుచుండెడివారు, కాని ఇటీవల యూరోపు ఖండవాసులు మన దేశమునకు వచ్చిన తరువాత చౌకగనుండు యాంత్రపు సరకుల యెదుట మనదేశపు సరకులు నిలువజాలక పోయినవి. ఢక్కా మజ్లిన్‌లు మాయమయినవి. ఇనుము ఉక్కు పరిశ్రమలు నిలిచినవి కావు కాని ఇప్పటికిని కాశ్మీరపు శాలువల నేతమాత్రము కొద్దిగా జరుగుచున్నది.

ఇవుడిపుడు మనదేశపువారు యూరోపియనుల పద్ధతుల ననుసరించి క్రొత్తక్రొత్త పరిశ్రమలను స్థాపించియున్నారు స్థాపించుచు నున్నారు బారకూరు నందు ఇనుప పరిశ్రమ బయలుదేరినది. తిరువాన్కూరు నందు అగ్గిపుల్లల పరిశ్రమ బయలుదేర నున్నది తిరువాన్కూరునందేల బయలు దేరవలెను? బళ్ళారియందు కూడగా? పోనిండు. ముఖ్యపట్టణమగు మద్రాసునందు యంత్రశాల కట్టకూడదా? కావలసినంతస్థలము సైదాపేటయందు సమీపముననే ఉన్నదికదా. (కలపలేకపోవుటయే ఇందుకు కారణము.)

1915 వ సంవత్సరము ఆగస్టు నెలనుండి జరుగుచున్న మహాసంగ్రామము ఒకవిషయమును తేటపరిచినది ప్రతిదినోపయోగమగు వస్తువులన్నియు విదేశములనుండి రావలసిన పనియు, విదేశముల సాయములేనిదే మనదేశపు జనులు నాగరకులవలె దిరుగుటకు వీలులేదనియు తేటపడినది. పూర్వము నుండియు పరిశ్రమలకు పేరొందిన మనదేశమిప్పుడిట్టి స్థితియందుండుట విచారకరము. చిన్నమొన్న కన్నులు తెఱచిన జపాన్ దేశము మనకు సరకుల నెగుమతి చేయుగలుగుట చూడ మనదేశపు జనులును, దేశాధీశులును నిదురించుచున్నట్లు కనుపడుచున్నది. జపాను దేశమింత త్వరగా వృద్ధినొందుటకును మనదేశము వెనుకబడియుండుటకును కారణములు లేకపోలేదు వానినన్నటి

నిట చర్చించుటకు వీలులేదు కాని జపాన్ దేశీయులకుండు దేశాభిమానము మనజనులకుండ లేని, జపాన్ దేశపు దొరతనమువారివలె మనదొరతనమువారు కూడ ప్రజాక్షేమము నేశ్యగణించి పరిశ్రమాభివృద్ధికై పాటుపడిరేని, మనదేశ మభ్యుదయము నొంది మన యావశ్యకముల తీర్చుటయేగాక విదేశములకు గూడ సరుకులు సప్లయి చేయగల స్వభావసంపద మనకుకలదని నిస్సందేహ ముగాజెప్పవచ్చును

ప్రత్తిపరిశ్రమ: ఇది మనదేశమునందు అనాదిగా నుండినది కాని యంత్రముల పోటీ వల్లనశించినది. ఇపుడు బొంబాయియందు యంత్రములు పెట్టి వానిచేత పనిచేయించు చున్నారు. ఇందుకు కారణము లున్నవి. సమీపమున ప్రత్తిపండు ప్రదేశమున్నది. ఇందు నయమైనప్రత్తి దొరకక పోయినను ముతుగు వస్త్రములకిది పనికి వచ్చుచున్నది, ఇచట నేలబొగ్గు లేదేమని సందేహము పుట్టుచున్నది కాని ఇంగ్లండునుండి వచ్చు స్టీమరులు కావలసినంత తెచ్చుచున్నవి. ఇదియు చౌకగా దొరుకును. బొంబాయి వారలకు కలకత్తా బొగ్గకంటెను ఇది చౌకగా గిట్టుచున్నది. ఈ రెంటికి తోడు ఇచటి వాయువునందు తేమ అధికముగా నుండుటచేత దారము తెగకుండును గనుక ఈపరిశ్రమ బాగుగా నెలకొల్పబడినది ఈ కారణము చేతనే ఢక్కానద్ద పూర్వము మంచినయమైన మజ్లిన్ బట్టలు తయారగుచుం డెడివి. ఇకమీద బొగ్గకుబదులు విద్యుచ్ఛక్తి ఉపయోగించెదరు, కావలసిన బాధపోవును.

జనుము: ప్రత్తి తరువాత ముఖ్యమైనది జనుము పరిశ్రమ. ఇదికల కత్తావద్ద యెక్కువగ జరుగుచున్నది. ఇందుకు కారణములు (1) జనుము ఇచటి జిల్లాభూములందు యెక్కువగా పండుట (2) సమీపమున బొగ్గు దొరుకుట (3) తయారైన గోనెసంచులు సముద్రముమీద సులభముగా నెగుమతి యగుటయేగాక మన దేశమునందే ధాన్యపుయెగుమతికిని ఇతర పదార్థముల యెగుమతిని ఉపయోగ పడుచుండుట. మన దేశపు సంచులు అమెరికాకును ఆస్ట్రేలియాకును యెక్కువగా యెగుమతి యగుచున్నవి. ధాన్యపుపంట తక్కువగు ఇంగ్లండునకు వీనివలన అంతప్రయోజనము లేదు

బొంబాయి నగరము ప్రత్తినుండి బాగుపడిన దంటిమేని కలకత్తా నగరము జనుమునుండి బాగుపడినదని చెప్పవలయును.

## వ్యాపారము

**ఎగుమతులు.** మనదేశము వ్యవసాయపుదేశమని కదా చెప్పితిమి. ఇందుచేత మనకు పంటలు దండిగా పండును. వీనినే మనము ఇతర దేశములకు ఎగుమతి చేయుదుము. ఈకారణముచేత మనము దిగుమతి చేయు పదార్థములన్నియు మ్యానుఫ్యాక్చరయినవివిగానే యుండవలయును.

## ముఖ్యమైన ఎగుమతులు

(1) **వడ్లు, బియ్యము.** 1910-లో 2323 లక్షల రూపాయల విలువగల ధాన్య మెగుమతి అయినది. ఇవి యేభాగములనుండి యెగుమతి యగును?

(2) **ప్రత్తి.** 1910=వ సంవత్సరములో 3605 లక్షల రూపాయల పత్తి పచ్చిదిగాను 1101 లక్షల విలువగల పత్తి మ్యానుఫ్యాక్చరయి యెగుమతి యయినది

| భాగము | ప్రత్తి<br>వేలరూపాయలు | బియ్యము<br>వేలరూపాయల కిమ్మతు |
|---|---|---|
| బంగాళా | 9,483 | 48,918 |
| తూర్పుబంగాళా | ... | 14 |
| బొంబాయి | 2,61,469 | 2,984 |
| సింధు ,, | 45,704 | 4,115 |
| మదరాసు | 41,418 | 14,095 |
| బర్మా | 2,478 | 1,43,22 |

## ప్రశ్నలు

1 ప్రత్తి యేభాగమునుండి ఎక్కువగా నెగుమతి యగుచున్నది? కారణమేమి? 3 ఈభాగమునందు నీటిసరఫరా యెట్లు? 3. సింధుదేశమున

వర్షము లేదు. ఇచట వరి, ప్రత్తి పండుటెట్లు? 4 తూర్పుబంగాళాలో ప్రత్తి లేదెందుకు? 5. బియ్యమైనను అంత యెక్కువగా పండ దెందుకు? 6. మదరాసునందు ప్రత్తి ఎగుమతి బియ్యమునకంటె యెక్కువగుటకు కారణమేమి? 7 పైజాబితాలయందు పంజాబు సంయుక్త రాష్ట్రముల పేరులు లేవెందుకు? ఇందుచేత ఈభాగములందు పంటలు యేవియును లేవని చెప్ప నగునా? 8 వడ్లయెగుమతి విలువప్రకారము మనదేశములోని భాగములను వరుసగా వ్రాయుము. 9. మొత్తము వడ్లయెగుమతి యెంత? 10 బంగాళా కంటె బర్మానుండి యెక్కువ బియ్యము యెగుమతి యగుటకు కారణము లేవి? బర్మాలో వరిపంటు ప్రదేశమెంత? బంగాళాలో నెంత?

**చమురు విత్తులు.** మన దేశమునుండి 1910-1101లో రు 2512 లక్షల విలువగల చమురు విత్తులు యెగుమతి యయినవి. ఇందు నువ్వులు ఆముదాలు, అగిసెవిత్తులు, వేరుసెనగ, గోగు, ప్రత్తివిత్తులు మొదలయినవి ముఖ్యమైనవి.

## ఎగుమతి జాబితా

| భాగము | వేలలో | |
|---|---|---|
| | చమురువిత్తులు | గోధుమలు |
| బంగాళా | 60,800 | 17,557 |
| తూర్పుబంగాళా | ... | ... |
| బొంబాయి | 1,30,017 | 13,457 |
| సింధుదేశము | 34,417 | 98,570 |
| మదరాసు | 25,156 | |
| బర్మా | 482 | . |

(4) ఎగుమతులలో నాల్గవది గోధుమపంట ఇది రు 1,259 లక్షల వరకు యెగుమతి అయినది.

## ప్రశ్నలు.

1. గోధుమ లెక్కనుండి యెక్కువగా యెగుమతియగునవి ఏవి? 2. మదరాసునుండి ఎగుమతి తక్కువగా నగుటను కారణమేమి? మదరాసులో ఏభాగమున నిదియుండవచ్చును? 3. ఒర్సాలో బొత్తుగా లేకుండుట కేమికారణము?

వీని తరువాత విలువనుబట్టి క్రమముగా జనుము, తేయాకు, చర్మములు ఎగుమతి యగుచున్నవి.

**దిగుమతులు.** ఇక దిగుమతుల నాలోచింతము. మనదేశములో మ్యానుఫ్యాక్చర్లు ఇంకను తక్కువని చెప్పితిమికదా. ఇందుచేత మనకు వాడుకకు తయారైన పదార్థములు యెక్కువగా కావలసియుండును. కాబట్టి మనము దిగుమతి చేయునవి అన్నియు మనము తయారుచేసుకొనజాలని పదార్థములే. ఈసంగతిని అనుభవరీత్యా కనుగొనుటకయి బజారునకు వెళ్ళుదము. ముందు బట్టలవర్తకుని అంగడికి వెళ్ళిన యెడల ఇంగ్లండులో చేయబడిన వస్త్రము లిచ్చును. మనదేశమున తయారైన వస్త్రములు కూడ కనపడునుగాని అవి అంత నయముగనుండవు. ఒకవేళ ఉండినను ధర యెక్కువగానుండును.

పసారు అంగడికి (కిరాణాకొట్టు) వెళ్ళితిమేని కలము మొదలుకొని అక్కడనుండు పెద్దపెద్ద పెట్టెలవరకును అన్నియు ఇతరదేశముల నుండి వచ్చినవియె! బాగుగా ఆలోచించి చూచిన యెడల మనము వాడుకొను పదార్థములన్నియు యూరోపు దేశములందు యంత్రములచే చౌకగా తయారయి మనకు వచ్చుచున్నవని తోచకమానదు. ఇందు ముఖ్యముగా బట్టల దిగుమతి యెక్కువ. ఇది జర్మని ఫ్రాన్సు దేశములనుండి కూడవచ్చును. కాని ముఖ్యముగా ఇంగ్లాండునుండియే దిగుమతియగుచున్నవి. దీనికిమ్మతు రు. 4483లక్షలు. రెండవది లోహములు పింగాణీలు, కోతసామాను. వీనితరువాత పంచదారయంత్రములు, రయిలుకుగాను కావలసిన యింజనులు కిరసనాయులు మొదలయినవి ఇంకను చిల్లరగావచ్చువస్తువులు యెన్నెనను కలవు.

ఇవిగాక జపాన్ (japan) నాల్వదేశములనుండి అగ్గిపుల్లలను ఆస్ట్రియనుండి యునామల్ పాత్రలను, స్విట్జర్లాండు, అమెరికా, జపానుల

నుండి గడియారములు, చైనానుండి టపాకాయలును (పటాకాయలు) వచ్చుచున్నవి.

అగ్గిపుల్లలు. ఈపరిశ్రమ మనదేశమున విరివిగాజరుగుటకు కావలసినంత రొండమున్నది హిమాలయపర్వతపు అడవులలోని కఱ్ఱ మిక్కిలిశ్రేష్ఠమైనది. తిరువాన్కూరులోను కొచ్చి, మైసూరులందును ఈపరిశ్రమజరుగుటకు అనుకూలములున్నవి కలపమైదానములకు తెచ్చుకొని కలపదొరకుచోట్లకితగిన తగినయంత్రములను దీసికొనిపోయినయెడల ఈపరిశ్రమ మనదేశమునవృద్ధి పొందగలదు. పూర్వము నార్వే దేశమునుండి వచ్చుచుండిన అగ్గిపెట్టెలు యుద్ధమువలన ఆగిపోయినవి. ఆదనుకనిపెట్టి పనిచేయు జపాన్ దేశమునుండి

| ఎగుమతులు. | | దిగుమతులు. | |
|---|---|---|---|
| | ఎక్కడికి | | ఎక్కడనుండి |
| గోధుమలు | బ్రిటన్ | 1 ఇనుప సామగ్రి | బ్రిటన్ |
| బియ్యము | హాలెండు, జపాను, ఆస్ట్రియా, హంగేరి, స్ట్రెయిటు సెటల్‌మెంటులు, | 2 పంచదార | జావా, మొరిషస్ దీవులు |
| | | 3 ఉన్ని | పర్షియా, ఆస్ట్రేలియా. |
| తేయాకు | బ్రిటన్, ఆస్ట్రేలియా, రష్యా. | 4 దూదిసరకులు | బ్రిటన్ |
| జనుము | బ్రిటన్, జర్మని. | 5 ఉన్నిసరకులు | బ్రిటన్, జర్మని |
| గోగు | బ్రిటన్, బెల్జియం. | 6 పట్టుసరకులు | జపాన్, ఫ్రాన్సు |
| పట్టు | ఫ్రాన్సు | | |
| జనుపసరకు | బ్రిటన్, సంయుక్తరాష్ట్రములు | | |
| ఉన్ని | బ్రిటన్ | | |
| దూది | జపాన్, జర్మని, బెల్జియం | | |
| నీలిమందు | బ్రిటన్, ఈజిప్టు | | |
| నల్లమందు | చైనా, హాంగ్‌కాంగు, స్ట్రెయిట్ సెటల్‌మెంట్లు. | | |

1914-15 సంవత్సరమున 113 లక్షలవెలగల అగ్గిపెట్టెలు దిగుమతియయిన వని చెప్పుటమన దేశమునకు గౌరవముకాదు. కాబట్టి ప్రజలును దొరతనము వారును యేకమయి ఈపరిశ్రమను మనదేశమున స్థిరముగా నెలకొల్పుట దేశ క్షేమకరము. ఆత్మగౌరవసూచకము. కావలసిన సాధనసామాగ్రియుండియు మనదేశము వెనుకబడియుండుట విచారకరము.

కాగితము. ఈపరిశ్రమ లేదనియె చెప్పవలయును. దీనికి కావలసిన గడ్డియు, వెదురును దేశమునందున్నదని చెప్పుకొనుటయే కాని పరిశ్రమ మాత్రము వృద్ధిబొందకున్నది. 20 వ శతాబ్దమున కాగితము కఱవయి యుండుట చూడ 'అంగట్లో అంతా ఉన్నది. అల్లుని నోటశనియున్నది" అన్నసామెత స్ఫురింపకమానదు.

## ప్రయాణ సాధనములు.

ఏబదిసంవత్సరములకు ముందు 'కాశికి పోయినవాడు కాటికిపోయిన వాడు ఒకటే,యని చెప్పుచుండిరి. అనగా కాశికిపోయినవాడు రాడని వారి యర్థము. ఎందుకు? ఆకాలమున రోడ్లుగాని రైలుదారులుగాని యుండి యుండలేదు ఉండిన కొన్నిరస్తాలయినను అడవులగుండ వెళ్ళుటచేత ఒంటి నంటిగా ప్రయాణముచేయుట కష్టముగా నుండుటయేగాక అపాయకరముగ కూడ నుండెడిది. మొదటిది. దొంగలబాధ రెండవది క్రూరమృగములబాధ ఇప్పటిస్థితిని చూచుము వారము రోజులలో కన్యాకుమారి మొదలు హరి ద్వారమువరకు వెళ్ళవచ్చును. కారణము రైలుదారులని వేరుగ చెప్ప వలయునా.

వెలనాడు, మురికినాడు, ప్రాంగ్నాడు, తెలగాణ్యులు, నందవరీకులు మొదలగు శాఖాభేదములకు కారణమేమి? ఆకాలమునందు ప్రయాణసౌకర్య ములు లేకపోవుటచేత యెక్కడివా రక్కడనే యుండి తక్కువజాతివారితో రక్తసంబంధము కలుగు నను భయముచేత చేసికొనిన నియమములుకదా. ఈ భేదము లింతకాలము బలిసియుండుటకు కారణము. ప్రయాణసౌకర్యములు లేకపోవుటయేకదా! ఇపుడిప్పు డీ భేదము లుండ కూడదని జనులలో అభి ప్రాయములు పుట్టుచున్నవి. ప్రయాణసాధనములేకదా మనల నందరిని ఏక ముగా చేయ యత్నించుచున్నవి.

పూర్వకాలమునందు యెచట పండినపంట అచటనే కర్చు కావలసి యుండుటచేత పండినచోట విశేషము చౌకగాను పండనిచోట్ల ప్రియముగాను అమ్మకము జరుగుచుండెడిది. పంటలేనియెడల క్షామముచేత వేలకొలది చచ్చుచుండిరికదా! ఇపుడు పండని దేశమునకు పండని దేశమునుండి యెగుమతి యగుచున్నది. కాన పండినదేశమునందును పండనిదేశమునందును దగలాకటిరే యగుటచే రూపాయకు 2½ శేర్లు బియ్యమమ్ముచుండినను క్షామముగా కనుపడుట లేదుకదా. పూర్వము రూపాయకు 24 శేర్లు అమ్ముచుండిరట! కాబట్టి రైలుదారులు, తరువాత రోడ్లు, కాలువలు ఈముఖ్యమైన ప్రయాణసాధనములు దేశమునంతను ఒకస్థితికి తెచ్చినవి.

ఉత్తరహిందూస్తానము గొప్ప మైదానమగుటచేత ఇనుపదారి సులభముగ చేయవచ్చును పైగా పంటలు విశేషము. జనసంఖ్య యెక్కువ కాబట్టి చీరకాయపీచువలె రైలుమార్గములు చిక్కగ నున్నవి దక్షిణమునందు అంతవిశేషముగా నుండుటకు వీలులేదు రైలుదారులు వేయుట కష్టము. అట్లు వేసినను దానివలన పెట్టుబడిదారుల కంతలాభము లేదు. కొన్నిభాగములందు ప్రయాణీకులు తక్కువయిన కారణముచేత జనమునకు ఒకటిరెండుబండ్లుమాత్రమే నడుపుచున్నారు. ధర్మవరం పాకాలశాఖ, గుంటకల్, బెజవాడశాఖ ఇందు కుదాహరణములు. ఇకముందు ఇవికూడ మంచి దరకు రావచ్చును.

(1) ఇందు ముఖ్యమైన రైలుదారుల నాల్'చింతము మదరాసునందు బయలుదేరి తూర్పుతీరమున నెల్లూరు, బెజవాడ, విశాఖపట్టణమునకు వెళ్ళునది మదరాసు సదరన్ మరాటారైల్వే కంపెనీ వారియొక్క శాఖలలో నొకటి. ఇది ఇక్కడినుండి విజయనగరము, బరంపురము శ్రీకాకుళము, కటకము మీదుగా కలకత్తాకు వెళ్ళు బెంగాల్ నాగపూరు రైలు తోవా ల్తేరువద్ద కలియుచున్నది.

రెండవశాఖ మధ్యభాగముగుండ అనగా రేణిగుంట, కడప, గుత్తి, గుంతకల్లు, రాయచూరువరకు వెళ్ళి అక్కడ మన్మాడు (Manmad) మీదుగా బొంబాయిచేరు గ్రేట్ ఇండియన్ పెనిన్సులర్ రయిల్ దారిలో కలియుచున్నది

44-వ పటము




M. S. M. Ry.

మూడవశాఖ పడమటి వైపునకు తిరిగి ఆర్కోణం, కాట్పాడిమీదుగా వెళ్ళి జాలార్పేట వద్ద రెండుపాయలై యొకటి బెంగుళూరునకును మరి యొకటి సేలం కోయంబత్తూరు మీదుగా పాలఘాటు గండిగుండ వెళ్ళి కళ్ళి కోట మంగళూరు చేరుచున్నది. ఇది పెద్దరైలు.

ఈపేరున చిన్నరైలొకటి యున్నది. ఇది మార్మగోవా నుండి గుంతకల్లు నంద్యాల మీదుగా బందరు చేరుచున్నది. మరియొక భాగము పడమటి కనుములమీదుగా బెంగుళూరు చేరుచున్నది. ఇచట సీనరి అత్యద్భుతముగా నుండునట

(2) సౌత్ ఇండియా రైలు చిన్నది. ఇది మదరాసునుండి దక్షిణముగా కుంభకోణము, మధుర మీదుగా తూతుకుడి చేరుచున్నది దీని శాఖ రామేశ్వరము వరకును పడమటి సముద్రతీరమున నుండు కిల్వాణకును పోవుచున్నది.

(3) పైనిజెప్పిన జి. ఐ. పి రైలు, బొంబాయి నుండిబయలుదేరి కళ్యాన్ (Kalyan) మీదుగా రాయచూరు వరకును, బొంబాయినుండి భుసావల్ (Bhusawal) మీదుగా జబ్బల్పూరు వరకును, భుసావల్ నుండి తూర్పున నాగపూరు వరకును వెళ్ళును.

(4) బెంగాల్నాగపూరు రైలు కలకత్తానుండి ఒకటి నాగపూరునకును, మరియొకటి వాల్తేరునకును పోవును.

(5) ఉత్తరమున ఈస్టు ఇండియన్ రైలుదారి యున్నది ఇది కలకత్తా నుండి, పాట్నా, కాన్పూరు, అలహాబాదు, డిల్లీ మీదుగా కాల్కాకు వెళ్ళుచున్నది. సింలాకు వెళ్ళువారు ఈదారినే వెళ్ళవలయును.

(6) సింధుమైదానమున నార్తువెస్టరన్ రైల్ దారి (N.W.Ry) యున్నది. ఇవికాక హిమాలయ పర్వతము మీదుగా డార్జిలింగునకు వెళ్ళు రైలు మిక్కిలి చిన్నది. ఇది పర్వతము నెక్కునపు డత్యద్భుతముగ నుండును.

సింధు మైదానమున నుండు రయిలుదారి రాజకీయ విషయమై యెక్కువ పనికి వచ్చుచున్నది. ఏమనగా అనాదినుండి మనదేశమునకు వచ్చిన శత్రురాజులు అఫ్గనిస్థానము బెలూచిస్థానము మీదుగా వచ్చుచుండెడివారు. ఇచటనుండు పర్వతపు కనుమలగుండ రాకపోకలు జరుగును. కాన వీనిని స్వాధీనమున నుంచుటకై బోలనుకనుమ వద్దనుండు క్వెట్టాకును, ఖైబర్ కనుమ వద్దనుండు పిషావరునకును రైలు వేసియున్నారు. ఖైబరు కనుమవద్ద కొంతవ్యాపారమైనను జరుగుచున్నది కాని క్వెట్టావద్ద యిట్టిదేదియు లేదు ఇది పూర్తిగా రాజకీయ కారణములచేత నేర్పడిన పట్టణము.

**కాలువలు.** నదీముఖ ద్వారమునందు డెల్టాయందు శాఖలనేకములు ప్రవహించుచుండును. ఈడెల్టాభాగములందు రాకపోకలకు ఈ స్వాభావికమైన కాలువలు పనికివచ్చును కాన వీనిలో కొన్నిటిని త్రవ్వి మంచిస్థితిలో నుంచుటచేత సాధారణపు స్టీమరులు వెళ్లుటకు వీలుండును. హుగ్లీశాఖ ఇట్టిదె.

ఇవి కాక నదులకడ్డముగ ఆనకట్టలుకట్టి వానిప్రక్కన పంటకాలువలు త్రవ్వియున్నారు. ఈపంటకాలువలు భూమి సాగుటకొరకే యైనను వీనియందు రహదారిపడవలు సరకులను మనుష్యులను మోసికొని పోవుచుండును.

హరిద్వారమువద్ద ప్రారంభమయి కాన్పూరువరకు (౨౦౦ మైళ్ళు) గంగకాలువ పారుచున్నది. తూర్పున చాండ్బాలి నుండి కలకత్తా వరకు సముద్రతీరమున కాలువ యున్నది పూర్వము అనగా 1899-వ సంవత్సరమునకు ముందు తిన్నగా కలకత్తాకు రైలుదారి లేనపుడు కటకమువద్ద రైలుదిగి మహానదిగుండ చాండ్బాలి మీదుగా కలకత్తాకు వెళ్ళవలసి యుండెను. పంజాబునందుండు పంటకాలువల సముదాయ మత్యద్భుతముగ నున్నది కదా. వీనికితోడు వెల్లునకాలువ లెంతపనిచేయుచుండియు ముందే చెప్పితిమి.

మనప్రాంత్యమునందు కృష్ణాడెల్టానుండి బకింగ్హాము కాలువ చెన్నపట్టణమువరకు వ్యాపించియున్నది ఇది చెడిపోయియున్నది.

ఇవికాక పూర్వము త్రవ్వబడియుండు కాలువలను దొరతనమువారు మరమ్మత్తుచేసి మంచిస్థితిలోనికి తెచ్చిరి 1500 సంవత్సరముల క్రిందట కట్టబడిన గొప్పఆనకట్టు(Grand anicut)వల్ల కావేరిజిల్లాలో నీటి సప్లయి జరుగుచుండెను. దీనిని కాటన్‌దొరవారు మరమ్మతుచేసి యెక్కువ ఛద్రపరచిరి. ఈపని జయప్రదముగా జరుగుటజూచి గోదావరి ఆనకట్టను కాటన్‌దొరగారే కట్టనిశ్చయించి నెరవేర్చిరి.

తుంగభద్రానది కడ్డముగా 16-వ శతాబ్దమున కృష్ణరాయలచే కట్టబడిన ఆనకట్టలవల్ల నీళ్ళుకాలువలకు పోవుచుండెడివి. ఉత్తర హిందూస్థానమునందు ఫిరోజిషా చక్రవర్తి త్రవ్వించినకాలువ పూడిపోయి యుండుటచేత దానిని అక్బరు మరల త్రవ్వించెను. కాని కాలవశమునఅవన్నియు పూడిపోవుటచేత దొరతనమువారు వీని నన్నిటిని త్రవ్వి సరియైన స్థితిలో నుంచియున్నారు.

ఇప్పటికిని మనదేశమునందు కాలువల కెడమున్నది. ముఖ్యముగా మనరాజధానిలోని మధ్యజిల్లాలకు వర్షము తక్కువగుటచేత కఱవులు పదేపదే వచ్చుచుండును, కాన తుంగభద్రానదికి అడ్డముగా ఆనకట్టకట్టి ఈజిల్లాలకు నీటిసప్లయి చేయవలయునని తీర్మానముచేసి కొలతపనులు జరిపిరి. కాని తరువాత అనుకొన్న దానికంటె యెక్కువ కర్చు చేయవలసియుండుటచేతను, తుంగభద్రలోని నీటి నిలువపనులు (Water Storage Works) మిక్కిలి పెద్దవిగా చేయవలసియుండుటచేతను నిమ్నోన్నతములను బట్టి చూడ ఈ జిల్లాలయందు కాలువలు త్రవ్వుటకు చాలఖర్చగుటచేతను, వీనివల్ల తగిన ఆదాయమురాదని మానివేసిరి. అయినను కాలువలు త్రవ్వినయెడల ఈ జిల్లాలలో పదేపదేకలుగుచుండు క్షామములు తగ్గిపోయి ప్రజాక్షేమకరమగునని మరల యోచన చేయుచున్నారట

## ప్రశ్నలు

I. (1) మనదేశమున రైలుదారులు అంతటను నిండుగాలేవు. ఎందుకు? (2) ఎచ్చట నిండుగ నున్నవి? ఎందుకు? (3) బొత్తుగాలేని భాగములను చెప్పుము? కారణ మేమైయుండును? (4) రైలుదారులకును భూమి యొక్క నిమ్నోన్నతములను సంబంధ మున్నదా? ఎట్లు?

II. (1) కాలువలు యెందుకు త్రవ్వుచున్నారు. ఎట్టిచోట కావలసియుండును? (2) గంగానది మైదానములో స్వాభావికముగానుండు కాలువలున్నవి. మనరాజధానిలో ఎందుకు లేవు? (3) కాలువలు త్రవ్వుట కెట్టి ప్రదేశము తగినది? (4) వెల్లువ కాలువలనగా నేమి? (5) పంజాబులోని కాలువలసంప్రదాయమును వర్ణించి చెప్పుము. దీనివలన పంజాబునకేమి లాభము? నష్టమేమయిన నున్నదా? (6) నిమ్నోన్నతముల ననుసరించియుండినవి రైలుదారులా? కాలువలా? ఎందుకు. (7) మనదేశమునకు రైలుదారులు ముఖ్యమా? కాలువలు ముఖ్యమా? ఎందుకు? (8) నదులు పూర్వము రాకపోకల కనుకూలముగ నుండెడివట. ఒకొక్కప్పుడు ఇవి ప్రతికూలముగ నుండునట. ఎందుకు? (వంతెనలు కట్టవలసి యుండుటచేత) (9) మనదేశపు నదులలో నావలకు పనికివచ్చినవేవి? పనికిరానివేవి? ఎందుకు? (10) మనకు నౌకాబలముండకుండుటకు కారణములున్నవా? ఇంగ్లీషువారు నౌకా సంపన్నులగుటకు కారణమేమి?

III. (1) మన దేశమునుండి యెగుమతియగు సరకులు యేయే దేశములకు వెళ్లుచున్నవి? (2) ఎగుమతిఅయిన సరుకులను విదేశములందు యేమి చేయుదురు? (3) సూయజ్ కాలువ త్రవ్వకముందు యేదారిని నావయాత్ర చేయుచుండిరి? (4) సూయజ్ కాలువవల్ల లాభమేమి? (5) బ్రిటిషు సామ్రాజ్యములో నొక భాగమగుటచేత మనదేశపు వ్యాపారమున కేమి లాభము? (6) మనదేశపు హార్బరులు కొన్ని వృద్ధిపొందినవి. కొన్ని నశించినవి ఇందునకు ఉదాహరణములనిచ్చి కారణముల చర్చింపుము? (7) మన రేవుస్థలములను వాని ప్రాముఖ్యమునుబట్టి వరుసగా వ్రాయుము. వీనికి ఆ ప్రాముఖ్యము యేలవచ్చినది? (8) కరాచీకి ప్రాముఖ్య మికమీదవచ్చును. ఏల?

IV. (1) జనుము. ఏభాగమునందు ఉత్పత్తియగుచున్నది? (2) దీనిని యేమిచేయుదురు? (3) జనుము యేరూపమున యెగుమతి యగుచున్నది? (4) ముఖ్యముగా యేదేశములకు వెళ్ళుచున్నది? (5) అచట దానిని యేమి చేయుదురు? (6) జనుమునకు ఎక్కువ గిరాకి తగులుట కేమికారణము?

V. (1) మన రేవుపట్టణములలో ఇవుడు ముఖ్యమైనవేవి? (2) పూర్వమునుండియు అవి ఉన్నతదశలో నుండినవా? సకారణముగా చెప్పుము. (3) ఈరేవులనుండి ఇతరదేశములకు వెళ్ళుస్టీమరులందు ఏసరకులుండగలవు? ఎందుకు? (4) వర్తకునకు కొబ్బరకాయలు, ప్రత్తి, తేయాకు, గోధుమలు, కావలసియున్నవి. ఇవి యెక్కడ దొరకును? (5) పండిన దేశమునందును పండని దేశమునందును ధాన్యము ఒకటేగా అమ్మునే? ఎందుకు?

జనులు: ప్రపంచములోనుండు జనులలో 2/5భాగము మనదేశమందున్నారు. 1911-వ సంవత్సరమున జరిగిన జనాభాపట్టి 315 కోట్లు జనులున్నారు.

వీరందరు దేశమందంతటను ఒకవిధముగా నుండుటలేదు. కొన్నిచోట్ల దట్టముగాను కొన్నిచోట్ల పలుచగాను ఉన్నారు. ఫలవంతములగు నదీమైదానములందును రోగములకు ఆటపట్టుకాని డెల్టాలయందును జనసమ్మర్ద మెక్కువ. ఎక్కడ పరిశ్రమలు వృద్ధియగుచున్నవో యెక్కడ ఖనిజసంపద యెక్కువగ దొరకునో అక్కడ జనసమ్మర్ద మెక్కువగ నుండునుగదా. దీనినిబట్టి గంగ, గోదావరి, కృష్ణ, కావేరి మైదానములందును, వీనిడెల్టాలందును జనసమ్మర్ద మెక్కువగనున్నదని తేలుచున్నది ఇదిగాక ఖనిజములు దొరకు రాణిగంజి, కోలారు మొదలగు ప్రదేశములందుకూడ జనసమ్మర్ద మెక్కువగ నుండును

పంటలు తక్కువగ నుండు మిట్టభూములందును,ఫలవంతములై అరణ్యమయమగు ప్రదేశమునందును, జనులు తక్కువగ నుందురు. రాజపుత్రస్థానము, బర్మాదేశములందు జనసమ్మర్దము లేకుండుట కివియె కారణములు.

పట్టణములవృద్ధి: రెండు నదులుకాని రెండు ముఖ్యమైనదారులు కాని కలియుచోట వ్యాపారము మెక్కువగును. జను లెక్కువగుదురు. జను లెక్కువగుటచేత వ్యాపారము ఎక్కువ జరుగవలసి యుండును. కాన నిట్టి ప్రదేశములందు పట్టణములు వృద్ధియయి జన సమ్మర్దము కలవియగును. రేణిగుంట, గుంటకల్ జంక్షన్‌లు పూర్వము నిర్జనముగా నుండినవి. రైలుదారులు పడిన తర్వాత నివి పెద్దవైనవి. ఉత్తరమున అలహాబాదు, పాట్నా, మొదలగు పట్టణముల యభివృద్ధికి కారణము లిట్టివే.

(2) ఇవిగాక రాజకీయ కారణము లున్నవి. ఏపట్టణము రాజధానిగా చేయుదురో వానియందు రాజకీయాంగము లన్నియు నుండును. ఇందుచేత జను లనేకులు ఇచట చేరుదురు. ఇది యెట్టిపనికిమాలిన స్థలమయినను, రాజధాని యయినయెడల పట్టణము తప్పక పెద్దదగును. సాధారణముగా దొరతనమువారు ముఖ్యపట్టణమును పనికిమాలినచోట నేర్పరుపరు కాని ఇతర సౌకర్యములకు తోడు అది రాజధానికూడ యయ్యెనేని పట్టణము మరింత గొప్పదగును. కలకత్తా బొంబాయి నగరములు ఇందు కుదాహరణములు. వీని యభివృద్ధి కారణములను చర్చింపుము మదరాసుయొక్క ప్రాముఖ్యము రాజధానికి ముఖ్యపట్టణముగా నుండుటవల్లనే కలిగినది. ఇది యెట్లో విశదపరుపుము !

ఈరాజకీయ కారణము మరియొక విధముగా కనపడుచున్నది. యుద్ధవిషయమున ముఖ్యమగు ప్రదేశమునందు ఇతరవిషయము లెట్లుండినను పట్టణము తప్పక ఉండవలసి యుండును. బోలన్ కనుమలవద్దనుండు క్వెట్టా ఇట్టిది, ఇది 5,500 అడుగుల యెత్తున పీఠభూమి మీదనుండు లోయలో నున్నది. దీనిచుట్టుపట్లు రాతి తెరనేల యగుటచేతను వర్షము కురియని భాగమగుటచేతను (ఎండుకు) బిట్టబీడుగ నుండును. శీతకాలమునందు నీరు పేరిపోవునంత చలిగ నుండును. ఇట్టి ప్రదేశమునందు జనుల నివసింప విచ్చగింతురా? అయినను బోలన్ కనుమకు కావలయుండుటకు సిబ్బంది నిందు ఉంచియుండుటచేత దండు ఉద్యోగస్థులకును సిపాయిలకును సప్లయి చేయుటకుగాను వ్యాపారస్థులు బయలుదేరి యున్నారు. పట్టణము ప్రబలియున్నది

(3) యాత్రాస్థలము లందు జనులు మూగుదురనుమాట అందరికిని తెలిసినదె. కొన్నిస్థలములకు సంవత్సరము పొడుగునను యాత్రికులు వెళ్ళు చుందురు. ఇట్టివి కాశీ, గయా, ప్రయాగ, హరిద్వారము జగన్నాథము, తిరుపతి, రామేశ్వరము మొదలైనవి. కొన్ని పట్టణములందు సంవత్సరమున కొకమారు లక్షలకొలది చేరుచుందురు. అలహాబాదు మాఘోత్సవము, జగన్నాథోత్సవము, కంచి గరుడసేవ, మొదలయిన విట్టివి.

(4) ఇన్నిటికంటెను వ్యాపారకారణములే ముఖ్యములు. జనసంఖ్యయొక్కువయినకొలదిని నాగరకతాభివృద్ధియైన కొలదిని జనుల యావశ్యకములు

మెండుగను వీని సప్లయికి పంటలు వృద్ధికావలయును. పరిశ్రమలు, యంత్రశాలలు, ఎక్కువగును. ఎగుమతి దిగుమతులు తప్పక యధికమగును కాబట్టి ఉత్పత్తి ప్రదేశములందును, ఎగుమతికి దిగుమతికిని పరిశ్రమలకును అనుకూలములుగల స్థలములందును, జనులు ఎక్కువగుట తప్పదు.

## ప్రశ్నలు

1. పట్టణములు వృద్ధియగుటకు కారణమేమి? ఉదాహరణముల చూపుము? 2. మనదేశమునందు పట్టణము లెక్కువగా లేవు. ఎందుకు? 3. అయోధ్య, తంజావూరు, పాట్నా (పాటలీపుత్రము) పడిపోయిన వెందుకు? 4. మనదేశపు వ్యాపారమునకు బ్రిటీషువారెట్లు సాయము చేయుచున్నారు? 5 మనదేశమున వ్యానఫ్యాక్చరులు లేకుండుటకు కారణమేమి? 6. బట్టలువడుకుటకు యంత్రశాలలు ఎక్కడెక్కడ ఉంచిన బాగుగా నుండును? 7. అగ్గిపుల్లల యంత్రశాలలకు ఏమి కావలసియుండును? ఇందుకు తగిన భాగములున్నవా?

## జనాభాలెక్కలు.

నాగరికతగల ప్రతిదేశమందును పది సంవత్సరముల కొకమారు జనుల లెక్క పెట్టుచున్నారు. ఇందుచే ప్రజల వృద్ధివిషయములు, వారిబాగోగులు, ఏయేభాగములం దెట్టి స్థితులున్నవో వీనివల్ల ప్రజలెట్లు మంచిచెడ్డల ననుభవించిరో, సంఘపుకట్లు బాగెట్లు పని చేయుచున్నవో మొదలుగాగల విషయము లెన్నియో తెలియుచున్నవి.

ఇట్టి లాభములున్నవని తెలియక మనదేశీయులు కొందఱు జనాభా లెక్కలవల్ల నష్టమున్నదనియు, మనుష్యులను లెక్క పెట్టుటచేత వారు చత్తురనియుం లేనిపోని భయములను పెట్టుకొని మనుష్యులను దాచియు, గణితీలెక్క వేయువారిని తిట్టియు, పరిపరి విధముల వారియెడల అయిష్టతను చూపుచుందురు. ఇందుకు వారి మూఢత్వమే కారణము కాని వేరుగాదు.

ఈ మాటలకు తోడుగా 1911 సంవత్సరమున జనాభా లెక్కల వల్ల తేలిన కొన్ని యంశములను చెప్పినయెడల బాగుగ నుండును. కాన కొన్నిటి నిట జెప్పెదము.

| చ॥ మైలు. జనసంఖ్య. |
|---|
| 1911—291 |
| 1911—269 |
| 1891—251 |
| 1881—217 |

ఈజనాభాలెక్కల ప్రకారము జనసంఖ్య యెక్కువయినదని తెలుచున్నది. ఈపత్రికన వ్రాయబడియుండు సంఖ్యలను చూడ జనవృద్ధి యెక్కువగుచున్నదని తోచక మానదు. కలరా బొబ్బజాడ్యము మొదలగు రోగములు పనిచేయుచున్నను జనసంఖ్య వృద్ధియగుచన్న దనుట విశేషవిషయము. జనులకుండు నెమ్మది ఇందుకొక కారణమని చెప్పకతీరదు

జనవమరణము సాలోచింతము. జాగిన పది సంవత్సరములో పుట్టిన జనులసంఖ్య1,13,14,152. ఇందు స్త్రీలు 55,36,480. పురుషులు 465,77,767 వీరిలో పది సంవత్సరములో చనిపోయినవారు 40,81,539. ఇందు 16,21,992. పురుషులు, 14,59,617 స్త్రీలు.

జనాభాలెక్కలు.

| మరణములు | పురుషులు | స్త్రీలు |
|---|---|---|
| మొత్తము | 43,42,651 | 41,74,304 |
| ఒకసంవత్సరములోగా | 10 86,361 | 9,35,373 |
| 10—15 వరకు | 1,61,773 | 1,45,614 |
| 15—20 | 1,48,194 | 1,82,636 |
| 20—30 | 3,14,385 | 3,85,308 |
| 30—40 | 3,50,668 | 3,30,145 |

పై జాబితాను చూడగా శైశవ దశయందు మరణము అధికముగా నున్నవనియు, తరువాత స్త్రీలు 15,20 సంవత్సరముల వయసున చాలమంది చనిపోవు చున్నారనియు, యేర్పడుచున్నది. ఇందుకు కొన్ని కారణములు చెప్పుదురు (1) తల్లికితగిన యీడురాని కారణముచేత శిశువు బాగుగా ఎదిగియుండదు. (2) తల్లీదండ్రులిద్దరు బాల్యదశయందుండినపుడు శిశువు తప్పక బలహీనముగ నుండును. (3) ఇందుకుతోడు తెలివిగల మంత్రసానులనుంచి కానుపు చేయించకుండుట, (4) జరుగుబడిగల వారియింటి స్త్రీలు గర్భకాలమునందైనను కదలక మెదలక జీర్ణముకాని పిండివంటలుమితిలేక తినుచుండుటచేత కలుగుఅనారోగ్యము. (5) చిన్నవయస్సునందే గర్భము ధరించుట తటస్థించి నపుడు మరణములు మెండు. అందులోను

భాగ్యవంతుల యిండ్లయందు పైకారణముచేత మరికొంచెము యెక్కువగ నుండును. కావున యిట్టి లోపము లున్నవని జనాభా లెక్కలు చూపుచున్నవి.

## 1911 జనాభా లెక్కలసారము.

| | విస్తీర్ణము (910) | జనసంఖ్య 1911 | జనసంఖ్య 1901 | హెచ్చు తక్కువలు. | 1901 చదరపుమైలునకు జనసంఖ్య. |
|---|---|---|---|---|---|
| 1 బర్మా | 236738 | 12115217 | 10490624 | 1624693 | 44 |
| 2 తూర్పుబంగాళా | 106130 | 34018527 | 40510344 | 3508183 | 292 |
| 3 బంగాళా | 115819 | 52668269 | 50715794 | ? | 438 |
| 4 యునైటెడ్ ప్రావిన్సెసు | 107164 | 47182044 | 47692277 | ? | 446 |
| 5 పంజాబు | 97209 | 19974956 | 20330337 | ? | 209 |
| 6 బొంబాయి | 75918 | 16113042 | ? | 808276 | 201 |
| 7 సింధుదేశము | 47066 | 3613435 | ? | 302525 | 68 |
| 8 ఏడన్ | 80 | 46165 | ? | 2191 | 549 |
| 9 మధ్యపరగణాలు | 100345 | 13916308 | 11971452 | 1944856 | 119 |
| 10 కొడగు | 1582 | 174976 | 180607 | ? | 115 |
| 11 మదరాసు | 141726 | 41406504 | 38229654 | | 269 |
| 12 అండమాన్ దీవులు | 3143 | 26459 | 24649 | 1810 | 8 |

మనరాజధానియందు మూగ చెవిటివారున్నారు. తెనుగు వారియందు మిగత వారికంటె యెక్కువగ నున్నారు. దీనికి కారణము రక్త సంబంధము గలవారిలో పెండ్లిండ్లు జరుగుటయని డాక్టరు నాయుడుగారు సెలవిచ్చియున్నారు. ఇందుకు తోడు మనదేశమునందు శిశువులకు రెండు మూడు సంవత్సరముల వరకు తల్లులు పాలిచ్చుట మరియొక కారణమట.

ఈవిషయమున పరిశీలన చేసిన డాక్టరు విలియంఫార్ కారు స్కాట్లాండు దేశములో నిల్లున్నదని వ్రాసియున్నారు "ఎక్కడతల్లులు 14, 18, నెలలు పిల్లలకు పాలిచ్చుచున్నారో ఆజిల్లాలయందు చెవిటి మూగ గ్రుడ్డివాండ్లు హెచ్చుగ నున్నారు"; ఇట్టి విషయములు అనేకములు జనాభా లెక్కల వల్ల తెలియుచున్నవి. కాన నాగరికతగల దేశములందు జనాభాలెక్కలు మిక్కిలి జాగ్రతగా తయారుచేయుచున్నారు.

## ప్రశ్నలు

1. ఈజాబితానుబట్టి చూచి జన సమ్మర్దముగల భాగములను వరుసగా వ్రాయుడు. 2. ఎక్కువ జనసమ్మర్దమునకును తక్కువ జనసమ్మర్దమునకు కారణమేమి. (3) బర్మాయందు జనసంఖ్య తక్కువగ నుండుటకుకారణమేమి. 4 ఏడన్ రేవుపట్టణమున్నది. ఇచ్చట జనసమ్మర్ద మెక్కువగుటకు కారణ మేమి? 5. మదరాసునందు ప్రతిచదరపు మైలునకును 269 జనులుందురు? కారణము వ్రాయుము6 6. జాబితానుబట్టి జనసమ్మర్దమునకు తగిన కారణము లను విశదపరుపుము. 7. జనాభాలెక్కలవల్ల లాభమేమి. 8. మనదేశములో 10 కి ఒకరు పట్టణములో నుందురు. మిగతవారు పల్లెలలో నివసించువారు ఎందుకు? ఇంగ్లాండులో నిటుకాదు, ఏల 9. పట్టణములు ఎట్లు ఏర్పడును. కారణములను చర్చించుచు ఉదాహరణముల సహాయమున వివరింపుము, 10. ఇప్పుడిప్పుడు జనులు పల్లెల వదలి పట్టణములను చేరుచున్నారు. కారణములేమైయుండును. 11. వలస పోవుట యనగా నర్థమేమి ఎమిగ్రేషన్ Emigration) కును దీనికిని భేదమేమి. 12. మన చెన్నరాజ్యమునుండి ఎక్కడికి ఎమిగ్రేషన్ జరుగుచున్నది. ఎందుకు.

## భాషలు

జనులు మాటలాడుభాష లెన్నియో ఉన్నవి. కొన్నిభాషలు వ్రాత రూపమున లేవు.

1901 వ సంవత్సరపు జనాభాలెక్కల ప్రకారమే మనదేశమున వాడుకలోనుండు భాషల జాబితాక్రింద కనబడుచున్నది. ఇందు జనసంఖ్య లక్షలలో చూపబడియున్నది

46-వ పటము


INDIA : LANGUAGES
70°
80°
90°
100°
30°
20°
10°
PUSHTU
LANDA
PANJABI
BELUCH
SINDHI
RAJASTHANI
PAHARI
HINDI
BEHARI
ASSAMESE
GUJARATI
BENGALI
BURMESE
URIYA
MARATHI
TELUGU
KANNADA
MALAYALAM
TAMIL

| భాష | జనసంఖ్య లక్షలలో | భాష | జనసంఖ్య లక్షలలో | భాష | జనసంఖ్య లక్షలలో |
|---|---|---|---|---|---|
| హిందీ | 871 | గుజరాతి | 99 | మధ్యపహారి | 13 |
| బంగాళీ | 446 | ఓఢ్రము | 96 | పుష్తు | 12 |
| తెనుగు | 207 | బర్మా | 76 | గోండి | 11 |
| మరాటి | 182 | మలయాళము | 60 | కారెన్ | 8 |
| పంజాబీ | 170 | సింధభాష | 30 | బరేయాక్ | 5 |
| అరవము | 165 | సంతాలి | 18 | టోలు | 5 |
| రాజస్థాని | 109 | పహారి | 17 | ఖాండు | 4 |
| కన్నడము | 103 | అస్సామి | 13 | జిప్సి | 3 |

## ప్రశ్నలు

1. ఈభాషలలో యెక్కువ వాడుకలో నుండునవెవ్వి. 2. ఇండియా పటమును గీచి అందు మాటలాడు భాషలను చూపుము. 3. చెన్నరాజ్యము నందు వాడుకలోనుండు భాషలను పటముచేత చూపుము. 4. ఇందెక్కువ వాడుకలోనుండు భాషయేది.

## మతములు

మనదేశమునందు ముఖ్యముగా నుండు మతములు (1) హిందూ మతము, (2) మహమ్మదీయమతము, (3) జైనమతము, (4) క్రైస్తవమతము, (5) బౌద్ధమతము మొదలగునవి.

### 1911 వ జనాభా ప్రకారము మనదేశపు మతములు

| | | | |
|---|---|---|---|
| హిందువులు | .. | . | 21,75,87,920 |
| సీకులు | .. | .. | 30,14,466 |
| జైనులు | ... | .. | 12,48,182 |
| బౌద్ధులు | .. | .. | 1,07,21,449 |
| పార్సికులు | .. | . | 1,00,100 |
| మహమ్మదీయులు | ... | .. | 6,66,23,412 |
| క్రైస్తవులు | ... | ... | 38,76,196 |
| యూధులు | ... | ... | 20,980 |

| | | | |
|---|---|---|---|
| భూతముల నారాధించువారు | ... | ... | 1,02,95,168 |
| ఇతరులు | ... | ... | 37,108 |
| | | మొత్తము. | 31,35,23,981 |

హిందూమతము: ఇది ఇట్టిదని నిర్ణయించుట కష్టము. పోలేరమ్మ, బొబ్బలమ్మ, అటలమ్మ, మొదలగు దేవతల యారాధనము మొదలు ఉపనిషత్తులయందు చెప్పబడిన ఏకేశ్వరారాధనము వరకును పలుతెరంగులు గానున్నది. ఇందు జాతిభేదము లనేకములున్నవి. పేరునకు జాతులు నాలుగే కాని ఇందొక్కొక్కటి శాఖోపశాఖలుగా బహులుదేరియున్నవి, పూర్వమీజాతిభేదములు, లేవనియు, ఈనడుమ వచ్చిన వీనివల్ల దేశమునకు బాధ కలుగుచున్నదనియు, కొందరి అభిప్రాయము.

సామాన్యముగా వాడుకలోనుండు హిందూమతమునందు లోపము లనేకములున్నవనియు, ఏకారణముచేతనో సాంఘిక విషయములు మతముతో కలిసిపోయినవనియు, తలచి నూతన ప్రకృతిశాస్త్రముల కనుగుణ్యముగను వివేచనాబుద్ధికి తగినట్లుండునట్టుగను సంస్కరణముచేయవలయునని కొందరు మహాజనులు బయలుదేరి సమాజములను స్థాపించియున్నారు.

ఇందు దివ్యజ్ఞాన సమాజము వారొకరు. (Theosophical Society) ఈసమాజమునందు అన్నిమతములవారు ఉండవచ్చును. వీరు కర్మ పునర్జన్మము' లందు విశ్వాసము కలవారు. జాతిభేదము లుండవలెనని కాదు వీరి యభిప్రాయము. వీరు దక్షిణదేశమున నెక్కువగ నున్నారు. చెన్నపట్టణమువద్దనుండు అడయార్ (Adyar) దీనికి ఆదిపీఠము.

ఆర్యసమాజము వారు మరియొకరు. వీరు వేదములను నమ్ముచున్నారు. వీరియందు జాతిభేదములు కొంతవరకున్నవిగాని జాతిభేదము లుయు పుట్టుకనుబట్టి రావనియును గుణములనుబట్టి జాతిభేదముల నిర్ణయింపవలయుననియు వీరిమతము. ఇందుచేత వీరు అన్యమతములలో చేరిన హిందువు

లను మరల ఆర్యమతములో కలుపుకొందురు. పైగా తక్కువ వర్ణములలో తగిన వారికి గాయత్రీమంత్ర ముపదేశముచేసి జందెమువేసి అగ్రవర్ణములో కలుపుదురు. వీరు పంజాబుదేశమందు యెక్కువగనున్నారు.

బ్రహ్మసమాజ మతము మూడవది. ఇది రాజా రామమోహనరాయలు, కేశవచంద్రసేనులు స్థాపించిన మతము. ఇది హిందూమతమేయనియు దానిని పరిష్కరించితిమనియు వీరు చెప్పుదురు. వీరు ప్రతివిషయమును మానవునియొక్క వివేచనాబుద్ధిచేత (Reasoning faculty) నిర్ణయింతురు. ఈ మతమనియు ఆమతమనియు భేదములేక అన్నిమతములనుండియును సత్యమును గ్రహించితిమని చెప్పుదురు.

అన్నివిషయములందువలెనె మతములందును మార్పులు కనబడుచున్నవి. మార్పులు లేకుండుట మరణమని ప్రకృతిశాస్త్రజ్ఞులు చెప్పగా విందుముకదా. ఈమతములు కొంతకాలము ఒకటిగానుండి అనుచరులయందు అభిప్రాయభేదములు కలుగుటచేత చీలిపోయి శాఖలగుచున్నవి. ఇంకను ఎన్నిశాఖలు కానున్నవో యెవరుచెప్పగలరు? ప్రతిమనుజునకును ఒక్కొక్కమత మేర్పడుట వింతకాదు బాధలేదు,

క్రైస్తవమతము: ఇది మనదేశమును పాలించువారి మతము. ఈ మతము ప్యాలస్టైన్ దేశములోపుట్టి పాదిరులమూలముగా అచ్చటచ్చటను వ్యాపించినది. ఈమతబోధకుల సహాయమువల్ల మిక్కిలి దీనదశయందుండిన అధమజాతివారు చాలమంది ఉద్ధరింపబడుచున్నారు. ఏదియెట్లున్నను వీరికి విద్యలభించినది. సంఘములో నెక్కువ గౌరవము గలిగినది.

మహమ్మదీయమతము: ఏకేశ్వరారాధనము నేనిర్ణయించివిగ్రహారాధన తగదని వారించు మతమిది, ఇది అరేబియాలో నుండుకాలమున మహ-

మ్మద్ అను ప్రాఫెటుచే స్థాపింపబడినది కనుక దీనికి మహమ్మదీయ మతమని పేరు. మక్కా వీరికి ఆది పీఠము.

బౌద్ధమతము: ఉత్తరహిందూస్థానమందు రాజ్యము చేయుచుండిన రాజకుమారుడగు గౌతముడు 20 వ యేట సన్యసించి ఉపవాసాదులవల్లను బలులచేతను మోక్షములేదని అనుభవమువల్ల తెలిసికొనినవాడయి జాతిభేదములు లేవనియు ఉపవాసాదులు ఆవశ్యకములు కావనియు జన్మరాహిత్యమునకు కావలసినవి ఇంద్రియనిగ్రహము దయాదాక్షిణ్యములే యని యుచాటిచెప్పి తన జీవనమువల్ల సత్యమును బోధపరచెను ఇతర మతోద్ధారకులుకూడ శ్రమపడిరి. జీసను బీదవాడయ్యును రాజునే ధిక్కరించి తనకు నిజమని తోచిన మతమునే చాటిచెప్పెను. ఇందున కతని చిత్రవధచేసిరి కాని మనస్థైర్యము మానడయ్యెను. మహమ్మదుకూడ శ్రమపడినవాడే కాని బుద్ధునివలె భోగియై సంపదలో నోలలాడుచు చిన్నవయస్సునందే పెండ్లియాడి సౌందర్యవతియు గుణవతియూనగు భార్యబిడ్డను గలవాడై వీని నన్నిటిని త్యజించి జోగియై సంచరించినవాడు మరియొకడున్నాడని తలచుట కష్టము. ఈమహనీయుడు సత్యశౌచంబులె దయాదాక్షిణ్యములే జన్మరాహిత్యమునకు దారులని చాటిచెప్పెను. కాని అతని యనుచరులలో దురాచారములు దుర్మార్గములు దొంగవేషములుపుట్టి కొంతవరకు మతమునకు నాశన కారణములయినవి.

అన్నిమతములలో చెప్పిననీతులు దాదాపుగా నొకటేగాని వ్యవహారభేదములవలన ఈయేకత్వమును జనులెరుంగకుండుటచేత ఈమతములు తగవులకును, విరోధములకును కారణములగుచున్నవి ఇందుచేత నీలోపములు మతోద్ధారకులగు మహానుభావులవని తలపరాదు. మన ఆత్మాభివృద్ధిని నిరంతర మాటంకరచుచుండు ఈ దేహమే కారణము. ఇంద్రియముల వశపరచుకొనలేక కోరికలను కాంక్షను అపుకొనజాలక మనము న్యాయమార్గము వదలి చిక్కులలో పడి పొరలుచుందుము.





శ్రీ గాంధిమహాత్ములు

ఏలుబడి: మన దేశమును పూర్వము హిందూరాజులు పాలించుచుండిరియు. తరువాత అఫ్ఘనులు మొగలాయీలు వచ్చిరనియు వీరితరువాత ఆంగ్లేయులు వచ్చి దేశమునంతను స్వాధీనపరచుకొని పాలించుచున్నారనియు చరిత్రవలన తెలిసికొనియుందురు.

ఈపాలనక్రింద గడబిడలుపోయి నెమ్మది కలిగినదనియు, ఎప్పటచూచినను రైల్ దారులు ప్రబలి దేశములోని వివిధభాగముల నొకటిగా చేయు

చున్నవనియు నెరుగుదుము. ఆంగ్లేయభాష మనకు దొరకుట యొక్క గొప్పవిషయము. ప్రకృతిశాస్త్రజ్ఞానమంతయు మనకాభాషనుండియే వచ్చినది. ఈ భాష నేర్పుటకై యెన్ని పాఠశాలలు బయలుదేరినవి! ఎంత కర్చుగుచున్నది జనసంఖ్యనుబట్టి ఇదియెంతయు తక్కువేయైనను 1911 వ సంవత్సరము డిశంబరు 12 వ తేదీని రాజదంపతులు మన దేశమునకువచ్చి పట్టాభిషేకము మహోత్సవకాలమున ఢిల్లీనగర మికమీద ఇండియాకంతకును ముఖ్యపట్టణముగావలసినదనియు, విద్యావిషయమై యేటేటను యేబదిలక్షలరూపాయలు మామూలునకంటె నెక్కువ వ్యయము కావలయుననియు సెలవిచ్చిరి. ఆనాటినుండియు పాలించువారియందు ధారాళి మెక్కువ కనబడుచున్నది ఇటీవల ఇండియా దొరతనమువారు ప్రచురించిన విద్యా విషయక సంకల్పము (Educational policy) ను చూడ ఇంకను విద్యావిషయమున నెక్కువ శ్రద్ధను ధారాళమును చూపుదురని తోచుచున్నది ఇందు ఉదారబుద్ధిగల హార్డింజి ప్రభువుగారు ఎక్కువలాభమును కలుగజేయ యత్నించిరి, విద్య యభివృద్ధియయి మూఢవిశ్వాసములు తొలగి సద్వర్తన మలవడి దేశభక్తియు రాజభక్తియు దైవభక్తియు కలవారమై భారతీయుల మగు మనము పరస్పరముబాహ్యభేదములను పాటింపక సోదరులవలె మెలగుదుము గాక.

---

G. R.C.—9—20—2000